# మార్క్సిజం పాఠాలు

## 2

తెలుగు సేత : ఆర్వియార్


విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, బ్యాంక్ స్ట్రీట్,
హైదరాబాద్ - 500 001. ఆం.ప్ర.

**Marxism Paataalu - 2**
Translation from Englih to Telugu from the book
"A Dictionary of Marxist Thought" by R.Venkateswara Rao

రాజకీయ/సామాజిక/ఆర్థికశాస్త్ర గ్రంథాలు

ప్రచురణ నెం. : 21

ప్రతులు : 1000

ప్రథమ ముద్రణ : నవంబర్, 2004



వెల: రూ. 15-00

ప్రతులకు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
విజ్ఞాన్ భవన, అబిడ్స్, హైదరాబాద్-500 001.
E-mail: visalaandhraph@yahoo.com
విశాలాంధ్ర బుక్ హౌస్,
(అబిడ్స్ / సుల్తాన్‌బజార్) హైదరాబాద్,
విజయవాడ, అనంతపురం, విశాఖపట్నం,
గుంటూరు, తిరుపతి, హన్మకొండ, కాకినాడ.



ముద్రణ: విశాలాంధ్ర ప్రెస్, హిమాయత్‌నగర్, హైదరాబాదు.

# ఉద్యమ ప్రస్థానంలో వెలుగుల దీపం

మార్క్సిజం ఒక శాస్త్రం - ఒక శస్త్రం. నిత్యం ఆచరణ గీటురాయిమీద ఈ శస్త్రాన్ని పదును పెట్టుకోవాలి. ప్రపంచ వ్యాప్తంగా భిన్నభిన్న ప్రాంతాలలోని సామాజిక సమస్యలను అధ్యయనం చెయ్యటంలోనూ వాటికి ఆచరణాత్మక పరిష్కార మార్గాలను కనుగొనటంలోనూ ఈ సిద్ధాంతం ఒక శాస్త్రంగా రూపుదిద్దుకుంది. నిత్యం కొత్త ఆలోచనల వెలుగులో ఆచరణల ప్రబోధంతో సృజనాత్మకంగా పరిపుష్టమవుతోంది.

మార్క్సిజం గుడ్డిది కాదు - ఇది ఒక పిడివాదం కాదు. ఆచరణ యోగ్యమైన జీవన సిద్ధాంతం. సమసమాజస్థాపన దిశగా ప్రయాణించే మార్గాన్ని సుగమం చేసే సాధనం. దేశకాల పరిస్థితులను గమనంలోకి తీసుకోవటంలో మార్క్సిజం ప్రగతిశీల దృక్పథాన్ని ప్రదర్శిస్తుంది. పోరాట శక్తులను వివరిస్తుంది. పోరాట సందర్భాలను పరిపక్వమొనర్చే, పద్ధతులను మనముందుంచుతుంది. విప్లవ శ్రేణులకు వెన్నుదన్నుగా నిలిచి, విప్లవ కార్యాచరణలో రాగల వ్యక్తిగత బలహీనతలను గురించి ముందుగానే హెచ్చరించి సరిదిద్దుకోగల మార్గాలను విశదీకరిస్తుంది. నిత్యం మారుతున్న దోపిడీ శక్తుల అవతారాల ముసుగులను తొలగించి వానిని ఎదుర్కొనగల శక్తివంతమైన పోరాట ఆయుధాలను ప్రజాఉద్యమకారులకందిస్తుంది.

అలాంటి మార్క్సిజం సిద్ధాంత అవగాహనను పెంచుకోవడానికి ఉద్దేశించిన గ్రంథాలు ఇవి. ఇప్పటికే ప్రాథమికంగా మార్క్సిజాన్ని కొంత అధ్యయనం చేసిన వారికీ గ్రంథాలు ఉపయోగపడ్తాయి. "ఎ డిక్షనరీ ఆఫ్ మార్క్సిస్టు థాట్" అన్న ఆంగ్ల బృహద్గ్రంథంలోని కొన్ని అంశాలను ప్రముఖ సాహితీవేత్త శ్రీ ఆర్వియార్ ఈ రూపంలో మనకందిస్తున్నారు. కొన్ని సందర్భాలలో అనువాదంగానూ, మరి కొన్ని సందర్భాలలో అనుసృజనగానూ రచన సాగింది.

క్లుప్తత, స్పష్టతలకోసం అనువైన – సమానార్థక తెలుగు పదాల కోసం పడ్డ శ్రమ మనకు కనిపిస్తుంది. తత్వశాస్త్రంలో ఎదురయ్యే ఆంగ్ల సాంకేతిక పదాలకు సరైన తెలుగు పదాల సృజన ఇప్పుడిప్పుడే ఓ స్థాయికి చేరుకుంటోంది. ఆర్వియార్ ఆ దిశగా చేసిన కృషి ఇందులో చూడగలం.

పాఠకులూ, కార్యకర్తలూ మార్క్సిజం వెలుగులో ఉద్యమిస్తున్న వారూ దీని ఉపయోగాన్ని గ్రహించగలరని మా ఆకాంక్ష."ఎ డిక్షనరీ ఆఫ్ మార్క్సిస్ట్ థాట్" సంపాదకులకూ, అనువాదకులకూ కృతజ్ఞతలు.

ఏటుకూరి ప్రసాద్
సంపాదకుడు
విశాలాంధ్ర ప్రచురణాలయం.

# విషయ సూచిక





# భావజాలం

విమర్శనాత్మక పూర్వ తాత్విక చింతనలో రెండు పాయలు మార్క్స్, ఎంగెల్స్‌ల భావజాల భావనమీద ప్రత్యక్ష ప్రభావం కలిగించాయి. ఒక పక్క మతం గురించిన సమాలోచన. దీన్ని ఫ్రెంచి భౌతికవాదులూ, ఫోయెర్‌బాఖ్ వృద్ధిచేశారు. అటుపక్కన సంప్రదాయ జ్ఞాన మీమాంస సమాలోచన, జర్మన్ చైతన్య తత్వశాస్త్రం, ముఖ్యంగా హెగెల్స్ కృషిచేసినటువంటి కర్తృత్వ కార్యకలాపం గురించిన పునర్ మూల్యాంకనం. యీ సమాలోచనలు ప్రత్యేక సామాజిక పరిస్థితులను మతపర లేదా ఆధిభౌతిక వక్రీకరణలతో అనుసంధించడంలో విఫలం అయేయి. అప్పుడు మార్క్స్, ఎంగెల్స్‌ల సమాలోచన "విలోమ" మానవ చైతన్య రూపానికీ, మానవుల భౌతిక మనుగడకీ మధ్య అవసరార్థం వుండే బంధనాన్ని చూపించ ప్రయత్నించింది. యీ సంబంధాన్నే భావజాల భావన ఆలోచన వక్రీకరణ అని సూచిస్తుంది. యిది సాంఘిక వైరుధ్యాల నుంచి పుట్టుకొస్తుంది, వాటిని కప్పి వుంచుతుంది. పర్యవసానంగా భావజాలం పుట్టుక నుంచీ కూడా ఒక స్పష్టమైన వ్యతిరేకార్థక, విమర్శనాత్మక అర్థంతోనే వుంది.

మార్క్స్ రచనలని సమకాలీన అధ్యయనానికి భిన్నంగా, భావజాలం అన్న భావనను మార్క్స్ బౌద్ధిక అభివృద్ధి విభిన్నదశల నేపథ్యంలో పరిశీలించడం అవసరం. వాటి మధ్య యే హఠాత్ "జ్ఞాన మీమాంసాపర విచ్ఛిన్నత" లేదనుకుంటూనే యిది అవసరం. మార్క్స్ పరిణతి చెందుతూ వుండే కొద్దీ నూతన సమస్యల్ని పరిశోధిస్తూ వుండే కొద్దీ అర్థావబోధలో మౌలిక కేంద్రకం నూతన పార్శ్వాల్ని దర్శించింది. మొదటి దశ మార్క్స్ తొలి రచనల కాలం నాటిది. 1844 దాకా వుంటుంది. యీదశలో ప్రముఖమైంది తాత్విక చర్చ. యిందులో ముఖ్యంగా ప్రస్తావనకు వచ్చిన అంశాలు హెగెల్‌కీ, ఫోయెర్‌బాఖ్‌కీ సంబంధించినవి. అప్పటికింకా మార్క్స్ రచనల్లో "భావజాలం" అన్న

పదబంధం తొంగిచూడలేదు. కాని అసన్న భావనలోని భౌతికాంశాలు, ఆయన చేసిన మత విమర్శనంలో, రాజ్యం గురించిన హెగెలియన్ విమర్శనలో కనిపిస్తాయి. మతం గురించీ, హెగెల్ రాజ్యభావన గురించీ ఆయన అవి తలకిందులు అనీ, వస్తువుల అసలు స్వభావాన్ని మరుగున పెట్టేవి అనీ చెప్పేడు. హెగెల్ "విలోమం" కర్తృకమైన దాన్ని వస్తుగతంగా, దీన్ని అటుగా మార్చడంలో వుంటుందని విమర్శించాడు. ఆ రకంగా హెగెల్ ప్రకారం భావం అనేది అనుభవ ప్రపంచంలో స్వయం వ్యక్తమవుతూ వుంటుందనీ, ప్రష్యన్ రాజ్యం ఆ భావ స్వయంవ్యక్తమనీ, "భావ" మే "నిరపేక్ష సార్వజనీనం" అనీ పౌరసమాజం నిర్ణయించేది కాకుండా తనే పౌర సమాజాన్ని నిర్ణయిస్తుందనీ తెలుస్తుంది.

ఏమైనా, హెగెల్ "విలోమం" భ్రమాన్విత గ్రహణ ఫలితంగా వచ్చి నటువంటిదికాదు. హెగెల్ దృక్పథం అపరిమేయం అయిందీ అంటే ఆ అపరిమేయం "రాజకీయ ప్రభుత్వ సంబంధి కాబట్టి. (క్రిటిక్ ఆఫ్ హెగెల్స్ ఫిలాసఫీ ఆఫ్ ద స్టేట్ చట్టసభ). యీ అర్థంలో, భావజాల పూరిత విలోమం అనేది యదార్థపు విలోమమే అవుతుందన్నది వాదన. యిదే భావం మార్క్సు మత విమర్శననీ సూచిస్తుంది. మనిషే మతాన్ని కల్పించుకుంటాడన్న ఫోయెర్‌బాఖ్ మౌలిక సూత్రీకరణను మార్క్సు అంగీకరించాడు. భగవంతుడు మానవుణ్ణి సృష్టించాడు అన్న భావన విలోమం అన్నదాన్ని అంగీకరించాడు. యిలా అంగీకరించినా మార్క్సు యీ విలోమం అనేది తాత్విక పరాయీకరణ కంటే లేదా ఒట్టి భ్రమకంటే యెక్కువే అని వాదిస్తూ ఫోయెర్‌బాఖ్‌ని దాటిపోయేడు. యిది వాస్తవ ప్రపంచపు వైరుధ్యాల్నీ, వ్యథలనీ వెల్లడి చేస్తుందన్నాడు. రాజ్యం, సమాజం మతాన్ని సృష్టిస్తాయి. యిది "ప్రపంచం గురించిన విలోమ చైతన్యం, యేమంటే అవే విలోమ ప్రపంచం కాబట్టి" (క్రిటిక్ ఆఫ్ హెగెల్స్ ఫిలాసఫీ ఆఫ్ రైట్. ముందుమాట). యదార్థంలో లోపంగా వున్నదాన్ని మతపర విలోమం పూరిస్తుంది మనసులో. అది యదార్థ ప్రపంచానికి ఆవల వున్న సమరసపూరిత పరిష్కారాన్ని ఊహాలలో పునర్ నిర్మిస్తుంది; వాస్తవ ప్రపంచంలో వున్న వైరుధ్యాల్ని సమసింప చెయ్యడానికిగాను యిలా చేస్తుంది.

రెండవదశ 1845లో ఫోయెర్‌బాఖ్‌తో మార్క్స్ తెగతెంపులు చేసుకున్నప్పటి నుంచీ మొదలై 1857 దాకా సాగుతుంది. యీ దశలోనే మార్క్స్, ఎంగెల్స్‌లు "చారిత్రక భౌతికవాదాన్ని" రూపొందించారు. దాంతో సమాజానికి సంబంధించీ, చరిత్రకు సంబంధించీ వాళ్ళ వైఖరిలోని సామాన్య సిద్ధాంతాలు విపులంగా వచ్చాయి, మొదటి దశ నాటి ఫోయెర్‌బాఖీయ దిశోన్ముఖత సొద్దు లేకుండా పరిత్యక్తం అయింది. యీ దశలోనే మొట్టమొదటిసారిగా భావజాలం అన్న భావనను ప్రవేశపెట్టడం జరిగింది. 'విలోమం' అన్న భావన నిలిచేవుంది. కాని మార్క్స్ దాన్ని మతం గురించి యువహెగెలియన్లు నిర్వహించిన విమర్శకీ, హెగెల్ తత్వశాస్త్రం గురించి వాళ్ళు చేసిన విమర్శనీ కలుపుకొచ్చేటట్టు విస్తరించాడు. వాళ్ళ విమర్శనలు హెగెలియన్ సిద్ధాంతాల మీద ఆధారపడినవే అని మార్క్స్‌కి తెలుసు, యేమంటే మనుషుల్ని పొరపాటు భావాల నుంచి విముక్తం చెయ్యడం వాళ్ళ కర్తవ్యం అని వాళ్ళు నమ్మేరు. "అయితే వాళ్ళు, యీ పదబంధాలకు మారుగా వేరు పదబంధాల్ని ప్రతిగా పెడుతున్నాడు అని వాళ్ళు అసలు వాస్తవ ప్రపంచంతో యే రకంగానూ ఘర్షణ పడడంలేదనీ మరిచిపోతున్నారు," అన్నాడు మార్క్స్. (జర్మన్ భావజాలం, వాల్యూం 1, భాగం 1). అంచేత మార్క్స్ విలోమం అని యిప్పుడు పిలిచే భావజాలం పాత, యువ హెగెలియన్లని యేక వర్గం చేస్తోంది భౌతిక వాస్తవం బదులు చైతన్యంతో ఆరంభించడంలో వుంది. తద్భిన్నంగా మార్క్స్ ఈ ఒక విషయాన్ని ధ్రువపరుస్తున్నాడు. అదేమిటీ అంటే మానవాళి నిజమైన సమస్యలు పొరపాటుగా వున్న భావాలు కాదు; కాని నిజంగా వున్న సామాజిక వైరుధ్యాలు. ఆ భావాలు యీ వైరుధ్యాల పర్యవసానంగా వచ్చినటువంటివి. ఫలితంగా తేలేది యేమిటి? మనుషులు తమ పరిమిత భౌతిక కార్యకలాప విధానంవల్ల, ఆచరణలో యీ వైరుధ్యాల్ని పరిష్కరించుకో లేనంత కాలం, వాటి చైతన్యంలో భావజాల రూపాలలో ముందు పెట్టుకుంటూ వుంటారు. అంటే, శుద్ధ మానసిక లేదా యుక్తిపూర్వక పరిష్కారాల్లో నన్నమాట. యీ పద్ధతి ఆ వైరుధ్యాల ఉనికినీ, స్వభావాన్నీ, పట్టుగా ముసుగుకమ్మి వుంచుతుంది లేదా పక్కకి మళ్లిస్తుంది. వైరుధ్యాల్ని కప్పివుంచడంవల్ల, భావజాల వక్రీకరణ అవి తిరిగి పట్టుకురావడానికి హేతువు అవుతుంది.

అంచేత పాలకవర్గ ప్రయోజనాలకి పీటవేస్తుంది. ఆ రకంగా భావజాలం ప్రతికూల, పరిమిత భావన అవుతుంది. యిది ప్రతికూలం, యెందుకనీ అంటే యిందులో వక్రీకరణ వుంది, వైరుధ్యాలని తప్పుగా ప్రతిఫలింప చెయ్యడం వుంది. యిది పరిమితం, యెందుకనీ అంటే అన్ని రకాల దోషాల్నీ, వక్రీకరణలనీ యిది కమ్ముకోదు. భావజాలాత్మక, భావజాలేతర భావనల మధ్య సంబంధాన్ని, దోషానికీ, సత్యానికీ మధ్య వున్న సాధారణ సంబంధంగా చెప్పడానికి లేదు. భావజాలాత్మక వక్రీకరణల్ని విమర్శతో అధిగమించి పోవడం కుదరదు. అవి పుట్టుకురావడానికి కారణమైన వైరుధ్యాలు ఆచరణలో పరిష్కారం అయినప్పుడే అవి అదృశ్యం అవుతాయి.

ఇక మూడవ దశ 1858లో "గ్రుండ్‌రిస్సె" రచనతో మొదలవుతుంది. అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ సాంఘిక సంబంధాల నిర్దిష్ట విశ్లేషణతో విశిష్టం అవుతుంది. యీ విశ్లేషణ "పెట్టుబడి" రచనలో శిఖరాన్ని చేరుకుంటుంది. యీ రచనల్లో భావజాలం అన్న పదబంధం మొత్తానికే మరుగున పడిపోతుంది. అయినా యీ భావనకు మార్క్స్ ఆర్థిక విశ్లేషణ యుక్తంగా వుంది. యీ విషయాన్ని "విలోమం" అన్న భావాన్ని స్థిరంగావాడడం, దాని మీదనే సాగడం తెలియచేస్తుంది. కొన్ని భావాలు వక్రీకృతం అయినా లేదా వాస్తవం "తలకిందులు" అయినా అందుకు కారణం యదార్థమే తలకిందులుగా వుండడం అన్న సూత్రీకరణకు మార్క్స్ అప్పటికే వచ్చాడు. అయితే యీ సంబంధానికి మాధ్యమం లేకుండా పోయింది, నేరుగా వుంది. పెట్టుబడి సాంఘిక సంబంధాల గురించి ఆయన నిర్దిష్ట విశ్లేషణ చేశాడు. దాంతో ఆయన, "విలోమ చైతన్యాని"కీ, "విలోమ యదార్థానికీ" మధ్య వున్న సంబంధం యదార్థంలో భాగమైన దృశ్యాల స్థాయినిబట్టి మాధ్యమం చెయ్యడం జరుగుతుంది అన్న మరింత తీర్మానానికి వచ్చాడు. యీ "దృశ్యరూపాల" రంగం విపణి వ్యవహారాల వల్ల యేర్పడుతుంది, పెట్టుబడిదారీ సమాజాల పోటీవల్ల యేర్పడుతుంది; ఉత్పత్తి రంగపు "విలోమ వ్యక్తత" యిది. "అసలు సంబంధాల" అంతర్గర్భిత స్థాయి యిది. మార్క్స్ చెప్పినట్టు:

పోటీలో ప్రతీదీ తల్లకిందులైనట్టు కనిపిస్తుంది.

ఆర్థిక సంబంధాలు వాస్తవ ఉనికిలోనూ, ఆ కారణం వల్ల ఆ సంబంధాలను వాటి వాహకంలో, ప్రతినిధులు అర్థం చేసుకునే ప్రయత్నంలో యేర్పరచుకున్న భావనల్లోనూ పైకి కనిపించేవాటి అంతర్గతమైన, అయితే సారభూతమైన రూపానికీ, తదనుగుణమైన భావనకూ చాలా భిన్నమైనది. నిజంగా వ్యతిరిక్తమైనదికూడా.

(పెట్టుబడి 3, అధ్యాయం 12)

అంచేత భావజాలం అంతర్గత సారభూత ధోరణి వైరుధ్యపూరిత స్వభావాన్ని ముసుగు కప్పివుంచుతుంది. ఎలాగ? అంటే పైకి ఆర్థిక సంబంధాలు కనిపించే ధోరణిమీద దృష్టి లగ్నం చేసి చలామణీ రంగంవల్ల యేర్పడ్డ దృశ్యమాన ప్రపంచం భావజాలపు ఆర్థిక రూపాల్ని కల్పించడమేకాదు, "మానవుని సహజ సిద్ధమైన హక్కుల స్వర్గధామం" కూడా. అక్కడ మాత్రమే స్వేచ్ఛ, సమానత్వం, ఆస్తి, బెంథామ్ పాలన సాగించడం వుంటుంది" (పెట్టుబడి. 1. అధ్యాయం 6). యీ మేరకు మార్కెట్ బూర్జువా రాజకీయ భావజాల స్రోతస్సుగా కూడా వుంటుంది, "ఆ రకంగా వినిమయ విలువలమీద ఆధారపడిన వినియమంలో సమానత్వం, స్వేచ్ఛ పరిపూర్ణం కావడమే కాదు, సకల సమానత్వానికీ, స్వేచ్ఛకీ వినిమయ విలువల వినిమయమే ఉత్పాదక నిజమైన పునాది." (గ్రుండ్‌రిస్సె. పెట్టుబడిమీద అధ్యాయం). కానైతే, స్వేచ్ఛా సమానత్వాల బూర్జువా భావజాలం వినిమయ ఉపరితలం కింద జరిగేదాన్ని కప్పి పుచ్చుతూ వుంటుంది. అక్కడ, "పైకి కనిపించే వ్యక్తి సమానత్వం, స్వేచ్ఛ అదృశ్యం అయిపోతాయి; అసమానత్వం, స్వేచ్ఛా రాహిత్యంగా తేలతాయి". (యిదే గ్రంథం)

మతం గురించి మార్క్స్ చేసిన విమర్శ వుంది. యిది తొలిది. అప్పటినుంచి మార్కెకీకృత ఆర్థిక దృగ్గోచర అంశాల ముసుగు తొలగించడం దాకా, పైకి కనిపించే స్వేచ్ఛాపూరిత, సమానత్వ పూరిత సూత్రాల ముసుగు తొలగించడం దాకా భావజాలం గురించిన మార్క్స్ అవగాహనలో గణనీయమైన స్థిరత్వం వుంది. చైతన్యంలోనూ, యదార్థంలోనూ ద్వంద్వ విలోమ భావన ఆది నుంచీ అలానే నిలబడి వుంది,. చివర్లో యిది మరింత సంక్లిష్టం అయినాగానీ. యెలా సంక్లిష్టం

అయిందీ అంటే పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానంలో వాస్తవంలోని రెండు పార్శ్వాలని విభేదం చెయ్యడంవల్ల. అంచేత, భావజాలం మొదటి నుంచీ విమర్శనాత్మకంగా ప్రతికూల అర్థంలోనే కనిపిస్తుంది. కానైతే, యదార్థ స్థితిలోని వైరుధ్యాల్ని, విలోమాన్ని ముసుగు కప్పివుంచడం అన్నదానికి సంబంధించిన వక్రీకరణల సందర్భంలో వాడడం జరిగింది. భావజాలం అనేది కుహనా చైతన్యం అన్న నిర్వచనాన్ని తరచుగా ఉల్లేఖిస్తూ వుంటారు. యీ అర్థంలో అది అంత సంతృప్తికరంగా కనిపించదు. యేమంటే విమర్శకు గురవుతూవున్న ఆ వక్రీకరణ రకం యేమిటో యిది నిర్దిష్టంగా చెప్పదు. ఆ విధంగా భావజాలం అనేదాన్ని గజిబిజి చేసే దారి తెరిచి పెడుతుంది, నానా రకాల దోషాలతోనూ.

మార్క్స్ గతించిన కొంత కాలానికే భావజాలం అన్న భావన నూతన అర్థాన్ని సంతరించుకోవడం మొదలుపెట్టింది. మొదట్లో విమర్శనాత్మక అర్థాన్ని విధాయకంగా కోల్పోలేదు, కాని దానికి ద్వితీయ స్థానం యిచ్చే ధోరణి తలెత్తింది. యీ కొత్త అర్థాలు రెండు ప్రధాన రూపాలు తీసుకున్నాయి; అనగా, సామాజిక చైతన్యరూపాల సమగ్రం అన్న భావన - "భావజాల ఉపరితల నిర్మాణం" అన్న భావనలో యిది వెల్లడైంది - అలాగే భావజాలం అనేది వర్గ ప్రయోజనాలకు అనుసంధించుకుని వున్న రాజకీయ భావాలు అని. యీ నూతన అర్థాలు మార్క్సిజం లోపల ఒక క్రమపద్ధతి పునఃపరిశీలన చేసినటువంటివి అన్నదాని ఫలితంగా వచ్చినవి కాకపోయినా, మొదట్లో వున్న వ్యతిరేకార్థక అర్థం మాత్రం చివరికి అవి తొలిగించాయి. యీ తొలగింపు జరిగిన క్రమానికి కారణాలు సంక్లిష్టంగా వున్నాయి. మొదటగా, భావజాలం గురించిన తటస్థ భావనాంశాలు మార్క్స్, ఎంగెల్స్‌ల సూత్రీకరణల్లోనే కనిపించాయి. మౌలికంగా వ్యతిరిక్త భావన దిశలోనే మొగ్గు వున్నాగానీ, వాళ్ళరచనలు సందిగ్ధ రహితంగా లేవు. అస్పష్ట ప్రకటనలూ లేకపోలేదు. యివి వేరే దిశను సూచిస్తున్నాయి. ఉదాహరణకు గ్రామ్‌స్కీ తరచుగా, మార్క్స్ న్యాయ, రాజకీయ, తాత్విక - "క్లుప్తంగా, మానవులు యీ సంఘర్షణ గురించిన చైతన్యవంతులై, పరిష్కారం కోసం యత్నం చేసే భావజాల రూపాలన్నీ" - అంశాల గురించి చేసిన ప్రస్తావనల భాగాన్ని ఉల్లేఖిస్తూ వుండేవాడు. ("ఏ కాన్‌ట్రిబ్యూషన్ టు ద క్రిటిక్ ఆఫ్

పొలిటికల్ ఎకానమీ" ముందుమాట). యెందుకూ అంటే భావజాలం గురించి తన వ్యాఖ్యానాన్ని బలపరుచుకుందుకు. భావజాలం అన్నిట్నీ పొదుపుకునే ఉపరితల నిర్మాణ రంగం. యిందులో మానవులు తమ వైరుధ్యపూరిత సాంఘిక సంబంధాల చైతన్యం పొందుతారు. ఎంగెల్స్, తనకిగా, "భావజాల ఉపరితల నిర్మాణం" గురించి, "భావజాల రంగాల" గురించీ, "భావజాల పరిధి" గురించీ కొన్ని సందర్భాల్లో ప్రస్తావించాడు. ఆ విధంగా తగినంత, సామాన్యీకరణ చేస్తూ, భావజాలం అనేది చైతన్యరూపాల సంపూర్ణత్వాన్ని పొదుపుకుంటున్నట్టు కొంతమంది అనుకునేలా చేశాడు. (యాంటీ డూరింగ్)

భావజాలం గురించిన సానుకూల భావనకు మరొక ప్రోత్సాహక అంశం మార్క్సు తర్వాత మొదటి రెండు తరాల మార్క్సిస్టులకి "జర్మన్ భావజాలం" అందుబాటులో లేకపోవడం. అది 1920ల దాకా ప్రచురితం అవలేదు. అంచేత భావజాలం గురించి మార్క్సుకి వున్న వ్యతిరేకాత్మక వైఖరితో ప్లెహనోవ్‌కి గాని లేబ్రియోలాకి గాని, మరీ ప్రముఖంగా లెనిన్‌కి గాని, గ్రామ్‌స్కీకి గాని, ల్యూకాక్స్ తొలి రచనల నాటికి ఆయనకిగాని పరిచయం లేదు. యీ రచన అందుబాటులో లేకపోవడంతో యీ భావన గురించిన చర్చకు చాలా బలమైన ఆధారాలు మార్క్సు 1859 నాటి ముందుమాట, ఎంగెల్స్ "యాంటీ - డూరింగ్", వీటి నూతన తరం మార్క్సిస్టులు పదేపదే ఉల్లేఖిస్తూ వుండేవారు. అయితే యీ రెండు గ్రంథాల్లోనూ ముఖ్యమైన సందిగ్ధతలు వున్నాయి. పునాది, ఉపరితలం సంబంధం మధ్య సంబంధం గురించిగాని, భావజాల దృగ్విషయం గురించి గాని తగినంత తేడా చూడవు అంచేత రానురాను భావజాలాత్మక ఉపరితల నిర్మాణం అనేది కాట్‌స్కీ మెహ్రింగ్, ప్లెహనోవ్ లాంటి వాళ్ళ రచనల్లో పొదుకున్నాయి. కాని 1898 దాకా యే నూతన తరం మార్క్సిస్టు మార్క్సిజమే ఒక భావజాలం అని బహిరంగంగా ప్రకటించలేకపోయారు.

మార్క్సిజం ఒక భావజాలమేనా అని మొదటగా ప్రశ్న లేవనెత్తిన వాడు బెర్న్‌స్టెయిన్. సమాజాల పరిణామాన్ని వివరించే భౌతిక అంశాలని ప్రస్తావిస్తాయి కాబట్టి శ్రామికవర్గ భావాలు వాటి దిశలో యదార్థమే అయినా, వాటిని ప్రతిచర్యలుగానే భావించడం జరుగుతుంది కాబట్టి

భావజాలమే అన్నది ఆయన జవాబు. భావజాలాన్ని భావాలతోనూ, ఆదర్శాలతోనూ సాదృశ్యం చెయ్యడంవల్ల మెహ్రింగ్, కాట్స్కీలు చేసిన దానికంటే యెక్కువగా యేమీ బెర్న్‌స్టెయిన్ చెయ్యలేదు. కాని వాళ్ళు చెయ్యని తీర్మానాన్ని ఆయన చేశాడు. అదేమిటీ అంటే మార్క్సిజం ఒక భావజాలం అయితీరుతుంది అని. భావజాలం గురించిన వ్యతిరేకాత్మక భావన గురించిన భావం యేదీ లేకపోవడం గమనించాలి. యేమంటే అప్పటికే మార్క్సుని "రివిజన్" చేసినందుకు బెర్న్‌స్టెయిన్ దాడికి గురయి వున్నాడు. మార్క్సిస్టు విమర్శకులు యే ఒక్కళ్ళు యీ విషయం గురించి ఆయన్ని యెత్తి చూపించలేదు. తొలితరం మార్క్సిస్టులు భావజాలం గురించిన వ్యతిరేకాత్మక భావనను సమర్థించడం మార్క్సిజం అంతస్సారం అని పరిగణించలేదు.

ఏది యేమైనా భావజాల భావన పరిణామానికి అతిముఖ్య కారణం అనుకూలమైనది, పంధొమ్మిదవ శతాబ్దపు ఆఖరి దశకాల్లో జరిగిన రాజకీయ పోరాటాల్లో వుంది, ముఖ్యంగా తూర్పు యూరప్ దేశాల్లో సాగిన పోరాటాలలో మార్క్సిజం రాజకీయ ఆచరణ సిద్ధాంతాన్ని సృష్టించాల్సిన అవసరం మీద దృష్టి లగ్నం చేసింది. అంచేత దీని అభివృద్ధి మరింతగా వర్గపోరాటాలకి సంబంధించి వుంది, పార్టీ నిర్మాణం మీద వుంది. వర్గాల రాజకీయ భావనలు ఘర్షణ నేపథ్యంలో నూతన ప్రాముఖ్యాన్ని సంతరించుకున్నాయి, వాటికి సైద్ధాంతికంగా జవాబుదారీతనం వుండవలసిన అవసరం వచ్చింది. భావజాల భావనను విస్తృతం చేసి లెనిన్ దీనికి పరిష్కారం చూపించాడు. వర్గ ఘర్షణ పరిస్థితిలో భావజాలం పాలకవర్గ ప్రయోజనాలకి అనుసంధించుకుని వున్నట్టు కనిపిస్తుంది. దానిమీద విమర్శ ఆధిపత్యానికి లొంగిన వర్గ ప్రయోజనాలకు సంబంధించి వుంది. వేరే రకంగా చెప్పాలీ అంటే పాలక వర్గ భావజాలాన్ని విమర్శించడం భిన్నవర్గ స్థానం నుంచి. సాగింది లేదా- విస్తృతి వల్ల - భిన్న భావజాల దృక్పథం నుంచి. అంచేత భావజాలం అనేది లెనిన్ దృష్టిలో అనేక వర్గాలకు సంబంధించిన రాజకీయ చైతన్యం. ముఖ్యంగా ఆయన బూర్జువా వర్గానికీ, సోషలిస్టు భావజాలనికీ మధ్య వున్న ప్రతిస్పర్థమీద దృష్టి పెట్టేడు. అంచేత లెనిన్‌తో భావజాల అర్థం పరిణామం చెందే క్రమం తారస్థాయికి చేరుకుంది. భావజాలం అనేది

యిక యెంతమాత్రమూ వక్రీకరణ కాదు, వైరుధ్యాల్ని కప్పివుంచదు. కాని ఒక తటస్థభావన అవుతుంది, వర్గాల రాజకీయ చైతన్యాన్ని సూచిస్తుంది, యిందులో శ్రామిక వర్గం కూడా వుంది.

అప్పటినుంచీ యీ విషయానికి నూతన తీరును రూపొందించడంలో లెనిన్ భావన కీలకమైన ప్రభావం కలిగించింది. యిది ఉదాహరణకు ల్యూకాక్స్‌లో కనిపిస్తుంది. ఆయన తన తొలి రచనల నాటినుంచీ భావజాలం, లేదా భావజాలాత్మకం అన్న మాటల్ని బూర్జువా శ్రామికవర్గ చైతన్యాలు రెండింటికీ వర్తించేటట్టు వాడేదు. వ్యతిరేకాత్మక అర్థమూ లేదు. ల్యూకాక్స్ అభిప్రాయంలో మార్క్సిజం, "పోరుకు సిద్ధమైవున్న శ్రామిక వర్గ భావజాలం." నిజానికి దాని "అతిశక్తివంతమైన ఆయుధం". దీనివల్ల బూర్జువావర్గ "భావజాలపు లొంగుబాటు". బూర్జువా వర్గ భావజాలం కుహనాత్మకం అయిందీ అంటే కారణం యిది సామాన్యంగా భావజాలం కాక పోవడం వల్ల కాదు, బూర్జువా వర్గ పరిస్థితి నిర్మాణాత్మకంగా పరిమితం అయింది కాబట్టి. యేమైనా బూర్జువా భావజాలం శ్రామికవర్గ మానసిక చైతన్యం మీద పెత్తనం చేసి, కలుషితం చేస్తుంది. యీ దృగ్గోచర విషయం గురించి ల్యూకాక్స్ వివరణ లెనిన్ వివరణను దాటిపోతుంది. లెనిన్‌కి సంబంధించి శ్రామికవర్గం భావజాలపరంగా కింది చెయ్యితో వుండడం, బూర్జువా వర్గానికి పాత భావజాలం వుండడం, భావాల్ని మరింత బలమైన సాధనాలతో వెదజల్లుతూ వుండడం కారణం. అయితే లూకాక్స్‌కి సంబంధించి శ్రామిక వర్గం వున్న పరిస్థితే, ఆచరణే అలా కింది చెయ్యితో వుండడానికి కారణం. పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థ రూపమే, శ్రామిక వర్గం యిలా వుండేటట్టు చేస్తుంది. యిక మరోవేపు తరవాత జీవితంలో ల్యూకాక్స్‌కి స్వయంగా గుర్తించినట్టు, తన తొలి రచనల్లో భావజాలం పాత్ర, భావజాల పోరాటం పాత్ర స్థిరంగా అతిచేసి చూపించినట్టు, అవే నిజమైన రాజకీయ ఆచరణకి, నిజమైన వర్గపోరాటానికీ మారు అయినట్టు కనిపించాయి.

భావజాలం పట్ల లెనిన్ వైఖరి కూడా గ్రామ్‌స్కీని ప్రభావితం చేసింది. ఆయన వ్యతిరేక భావనను వెల్లడిగానే వ్యతిరేకించాడు. యేమైనా గ్రామ్‌స్కీ వ్యతిరేకభావన మార్క్స్ దాంతో సరితూగదు. కాని ప్రత్యేక

వ్యక్తుల యధేచ్ఛ వైదుష్యపూరిత రచనలని" ప్రస్తావిస్తుంది. అంచేత ఆయన "యధేచ్ఛ భావజాలాలకీ" "సజీవ భావజాలాలకీ" మధ్య తేడాని ఆయన చేశాడు. రెండవదాని మీదనే దృష్టి లగ్నం చేశాడు. యీ అర్థంలో, "భావజాలం" ప్రపంచం గురించిన ఒక భావన. యిది కళల్లో, చట్టంలో, ఆర్థిక కార్యకలాపంలో సకల వైయక్తిక, సమష్టి జీవితంలో ప్రతిఫలిస్తుంది." అయితే భావజాలం అనేది భావాలకంటే యెక్కువే. యిది స్థిరమైన దృక్పథాల్ని ప్రోత్సహించే శక్తతతో వుండాలి. కార్యాచరణకు దిశానిర్దేశం చెయ్యాలి. అంచేత, భావజాలం "మనుషులు చరించగలిగేటట్టు తమ స్థానం గురించిన చైతన్యం సాధించగలిగేటట్టు, పోరాట చైతన్యం పొందగలిగేటట్టు వుండాలి." భావజాలం సామాజికంగా సర్వ వ్యాపకంగా వుంటుంది, అంటే మనుషులు ప్రకటన నియమాలు, దిశానిర్దేశం లేకుండా వుండరు. అందుచేత, భావజాలంతోనూ, భావజాలం వల్లా ఒక వర్గం మరో వర్గం మీద పెత్తనం చెలాయిస్తుంది. అంటే ప్రజాబాహుళ్యం తన రీతికి అతుక్కుని వుండడం, ఒప్పుదలతో వుండడం జరిగేటట్టు చేస్తుంది. లెనిన్, ల్యూకాక్స్‌లు భావజాలాన్ని సిద్ధాంత స్థాయిలోనే చూస్తే, గ్రామ్‌స్కీ భావజాలం స్థాయిల్లో నాలుగు అంతరాల్ని చూశాడు. అవేమిటీ అంటే తత్వశాస్త్రం, మతం, లోకజ్ఞానం, జానపద విజ్ఞానం. యివి విలోమక్రమ కాఠిన్యంతో బౌద్ధిక వ్యక్తీకరణతో వుంటాయి.

గ్రామ్‌స్కీ యెంత ఘనమైన సూచనగా బుద్ధిజీవుల పాత్రనీ, భావజాలం ప్రకటితం అయే తీరుల్నీ (విద్య, ప్రసార మాధ్యమాలు వగైరా) భావజాల ఉత్పత్తిలో నూతన పుంతల్ని ఆవిష్కరించాడు. లెనిన్, ల్యూకాక్స్‌లు సోషలిస్టు భావజాలానికీ సద్యోజనిత చైతన్యానికీ మధ్య అంతరానికి వారధి కట్టలేకపోయారు. అలాగా 'ఆపాదిత' చైతన్యానికీ, వర్గ మానసిక చైతన్యానికీ మధ్య అంతరాన్నీ కలపలేక పోయారు. అలాంటిది గ్రామ్‌స్కీ వాటి మధ్య నిర్ణాయకాల ద్వంద్వ ప్రవాహాన్ని దర్శించాడు. సోషలిస్టు భావజాలాన్ని మేధావులు అభివృద్ధి చేసే మాట నిజమే. కాని బుద్ధిజీవులకీ, యితరులకీ మధ్య నిరపేక్ష భేదం చూపించలేం. అదీగాక, వర్గమే చలనపూరిత బుద్ధిజీవుల్ని తయారు చేసు కుంటుంది. అంచేత శ్రామికవర్గంలోకి బయట నుంచి ఒక శాస్త్రాన్ని

ప్రవేశపెట్టడం అసాధ్యం. అయితే అప్పటికే అస్తిత్వంలో వున్న బౌద్ధిక కార్యకలాపాన్ని పునరుద్ధరించి, సవిమర్శకం చెయ్యడమే కర్తవ్యం. మార్క్సిస్టు భావజాలం లోపించిన చైతన్యానికి బదలాయింపుకాదు, కాని ఒక సమిష్టి సంకల్పానికి వ్యక్తీకరణ. వర్గంలో వున్న చారిత్రక దిశా నిర్దేశం.

మార్క్సిస్టు సంప్రదాయంలోనే భావజాలం గురించి రెండు ప్రముఖ భావనలు వుండడం చాలా చర్చలకు మూలం అయింది. యివాళ్టి రచయితలు కొందరు వీటిల్లో ఒకటే నిజమైన మార్క్సిస్టు సంబంధి అంటారు. యితరులు మార్క్సుకీ లెనిన్‌కీ మధ్య భేదం ఆమోదించలేక రెండింటినీ సమన్వయ పరచచూస్తారు. ఆల్తూసర్ విషయం యిదే. గత రెండు దశాబ్దాలుగా భావజాలం గురించి అత్యంత ప్రభావపూరిత వివరణలు ఆయన చేశాడు. ఆయన సామాన్యంగా భావజాలం సిద్ధాంతాన్ని వేర్పాటు చేశాడు. యిందులో భావజాలం కర్తవ్యం యేమిటీ అంటే సమాజంలో పొందిక కలిగించడం. నిర్దిష్ట భావజాలాలకీ దీనికీ తేడా వుంది. వాటి ప్రకారం మొదటి సామాన్య కర్తవ్యం ఒక వర్గం ఆధిపత్యం సంపాదించడంతో పై నుంచి నిర్ణయమవుతుంది. భావజాలం "వ్యక్తుల ఊహామాత్ర సంబంధాలు వాళ్ళ సామాజిక అసలు అస్తిత్వ పరిస్థితులకు ప్రాతినిధ్యం" వహించినంతమేరకు యీ కర్తవ్యాల్ని నిర్వహిస్తుంది. (ఆల్తూస్సర్) అలాగే వ్యక్తుల్ని సభ్యులుగా చేసి, ఉత్పత్తి సంబంధాలలో వాళ్ళ పాత్ర ఆమోదించినంత మేరకు భావజాల కర్తవ్యం వుంటుంది. అటు పక్క ఆల్తూస్సర్ ఆధిపత్య భావజాలాలనీ ధృవపరుస్తాడు. అవి పీడిత వర్గాల నిరసనను వ్యక్తం చేస్తాయి. శాస్త్రం భావజాలానికి శుద్ధ వ్యతిరేకం అని ఆల్తూస్సర్ నొక్కి చెప్పాడు. కాని అదే సమయంలో భావజాలాన్ని, సాపేక్షంగా స్వతంత్రంగా వున్న సమాజ వస్తుగత స్థాయి అనీ ఆయన అంటాడు. యీ వైఖరిలోని చిక్కు యెక్కడ వస్తుందీ అంటే సకల భావజాలమూ వ్యక్తుల్ని పెత్తందారీ వ్యవస్థకు లొంగి వుండేటట్టు చేస్తుందన్న విషయాన్ని, విప్లవ భావజాల మనుగడనీ సమన్వయపరచడం కుదరకపోవడంలో. అదీ గాక శాస్త్రానికి విరోధంగా తప్పుడు సంకేతంగా భావజాలం వుంటుందన్న అంశాన్ని భావజాలం వస్తుగత సమాజపు ఉపరితల నిర్మాణం అన్న అంశాన్నీ సమన్వయపరచడం చాలా కష్టం. ఆ ఉపరితల నిర్మాణంలో భావజాల

వక్రీకరణలు తప్ప మరేమీ లేనట్లయితే, శాస్త్రాన్ని వేరే స్థానంలో వుంచితే తప్ప. కానైతే యిక్కడా దాని చిక్కులు దానికి వున్నాయి.

# తత్వశాస్త్రం

సోషలిజం ఒక రూపంగా మార్క్సిజం కీలకమైన ఒక రాజకీయ ఆచరణాత్మక ఉద్యమానికి సంబంధించింది. మరి సోషలిజాల్లో దీన్ని విలక్షణంగా చేసేది యేమిటి? యిది విప్లవాత్మక ఆచరణనీ, మౌలిక సమగ్ర సామాజిక సిద్ధాంతాన్ని మేళవించుకోవడం. అయితే ఆ సిద్ధాంతం (సామాజిక, రాజకీయ) తత్వశాస్త్రంగాకాక సామాజికశాస్త్రంగా లక్ష్యం పెట్టుకొంది, అలా అని చాటుకుంది. అటువంటప్పుడు ఒక పక్క ఏకీకృతమైన శాస్త్రంగా, రాజకీయ ఆచరణగా వున్నదానికీ మరోపక్క తత్వశాస్త్రానికీ మధ్య సంబంధం యేమిటి? మార్క్సిజం యీ సంబంధాన్ని యెలా అర్థం చేసుకుంటుంది?

మార్క్స్ తన బౌద్ధిక జీవితాన్ని తత్వవేత్తగా ఆరంభించాడు. తర్వాత చారిత్రక భౌతికవాదశాస్త్రం వేపు పరిణామం చెందాడు. యిది "పెట్టుబడి" అన్న గ్రంథంలో పరాకాష్ఠ చెందింది. ఆ పరిణామం స్వభావం యేమిటి? దానికీ యూరపియన్ సంస్కృతిలో జరిగిన మరింత పరిణామానికీ సంబంధం యేమిటి. యీ పరిణామం వల్ల సాధారణంగా తత్వశాస్త్రమే మేధోపర ఆధిపత్య స్థానాన్ని శాస్త్రానికి దత్తం చేసింది. మొదట్లో, 17వ శతాబ్దంలో ప్రాకృతికశాస్త్రానికీ, మార్క్స్ కాలంలో సామాజిక శాస్త్రానికీ ఆ స్థానం దత్తం అయింది.

మార్క్సిజం నిజానికి బూర్జువా రాజకీయాలని వ్యతిరేకిస్తుంది. అదే విధంగా బూర్జువా సిద్ధాంతాన్ని, భావాలనీ వ్యతిరేకిస్తుంది. అలా అని బూర్జువా సిద్ధాంతాల్ని ఒట్టినే తిరస్కరించడం అనికాదు. ఓ రకంగా వాటిని గతి తార్కికంగా గ్రహించడం, పరివర్తన చెందించడం జరుగుతుంది. మార్క్సిస్టు సిద్ధాంతం ప్రధానంగా మౌలికంగా ఒక సామాజికశాస్త్రం. ప్రకృతిశాస్త్రంలో బూర్జువా సంస్కృతి శాస్త్రీయంగా స్థాపించిన సంప్రదాయాన్ని వారసత్వంగా అందుకోచూస్తూనే బూర్జువా శాస్త్రాల్ని ఖండిస్తుంది. ప్రాకృతికశాస్త్రం చారిత్రకంగా

మారుతూవుంటుందని మార్క్సిజం గ్రహిస్తుంది. ప్రకృతి చరిత్రను గుర్తించ నారంభిస్తూ, ముఖ్యంగా సిద్ధాంతీకరించడానికి చూస్తుంది. బూర్జువా శాస్త్రంతో యిలాంటి సంబంధాన్ని స్థాపించుకుంటూ మార్క్స్, మార్క్సిజం బూర్జువా తత్వశాస్త్రంలోని మూడు పాయలకి సానుకూలంగా ప్రతిస్పందించడం కనిపిస్తుంది! అరిస్టాటిలియనిజం, శాస్త్రీయ విప్లవ, వికాస యుగాల భౌతికవాదం, హెగెల్ గతితర్కం. యీ తత్వశాస్త్రాల్లోని కీలకాంశాల్ని గ్రహించుకున్నప్పటికీ, వాటిని ఒక సిద్ధాంతరూపంగా పరివర్తన చెందించడమూ వుంది. యీ రూపం బూర్జువా తత్వశాస్త్రానికి మొత్తం మీద ప్రతికూలంగా వుంటుంది. మార్క్సిజానికి సంబంధించి బూర్జువా తత్వశాస్త్రమే, బూర్జువా భావజాలంగా వుంటుంది.

ఇప్పుడు వేసుకోవాల్సిన ముఖ్యమైన ప్రశ్న: మార్క్సిజం తన మార్క్సిస్టు తత్వశాస్త్రంలోకి బూర్జువా తత్వశాస్త్రాన్ని గ్రహించి, వ్యతిరేకిస్తూ వుంటుందా? వాటిని తనలో నిబిడీకృతం చేసుకుని అలా చేస్తుందా? మార్క్సిస్టుశాస్త్రంలో అదనంగా చేరిగాని అంతర్గర్భితంగా గాని ఒక ప్రత్యేక ముద్రకలిగిన మార్క్సిస్టు తత్వశాస్త్రం వుందా? లేకపోతే చారిత్రక భౌతికవాదం అసలు తత్వశాస్త్రాన్నే ఖండించి, రద్దు చేస్తుందా? మార్క్స్ తదనంతర శకంలో యీ ప్రశ్నలకు మార్క్సిజమే ఘంటాపథంగా జవాబు చెప్పింది. నిజానికి మార్క్సిస్టు తత్వశాస్త్రం అనే వుందన్నది ఆ జవాబు. ఆ తాత్విక దృష్టితోనే బూర్జువా తత్వశాస్త్రాన్ని మార్క్సిజం వ్యతిరేకిస్తుంది అని అర్థంచేసుకోవాలి. మార్క్సిజం అభివృద్ధిని రెండు మార్క్సిస్టు తత్వశాస్త్రాల అనుగుణ్యతతో సాధారణంగా సిద్ధాంతీకరించడం జరుగుతుంది. అవి క్రమానుగతంగా ఆధిపత్యం వహించాయి. మొదటిది ఏంగెల్స్ తరవాతి రచనలతోనూ, తర్వాతది మార్క్స్ తొలి రచనలతోనూ సన్నిహితంగా కలిసివున్నాయి.

## గతితార్కిక భౌతికవాదం

మార్క్సిజం మొదటి తత్వశాస్త్రం గతితార్కిక భౌతికవాదం. యిది శాస్త్రీయ భౌతికవాద, హెగెల్ గతితర్కాల కలయిక. కనిపించే యదార్థం అనేది వైరుధ్యాల ఏకత అని యిది చెపుతుంది. దీంట్లోని వైరుధ్యాలు నిరంతర చారిత్రక పరిణామానికి దీన్ని నడిపిస్తాయి. ఆ మార్పులు

పరిణామాత్మకంగానూ, విప్లవాత్మకంగానూ కూడా వుంటాయి. వైరుధ్య పూరితం కావడంవల్ల, యీ యదార్థాన్ని వైరుధ్యపూరిత ప్రతిపాదనల ద్వారా మాత్రమే నిజంగా వివరించవచ్చు. ఫలితంగా దీనికి ప్రత్యేక గతితార్కిక తర్కం అవసరం అవుతుంది. వైరుధ్య రహిత సూత్రంతో వున్న సాధారణ తర్కాన్ని యిది తోసిరాజంటుంది. యీ దృక్పథంలోని భౌతికవాదం పదార్థాన్ని, బుద్ధినీ ఒక ఏకతలోని వైరుధ్యంగా భావిస్తుంది. యీ ఏకతలో పదార్థమే ప్రాథమికం అయింది. ఆ రకంగా గతితార్కిక భౌతికవాదం అనేది ఒక "ప్రపంచ దృక్పథం" (ఎంగెల్స్ "యాంటీ-డూరింగ్" ముందుమాట). యావత్తు వాస్తవికత స్వభావం గురించిన సిద్ధాంతం. ముఖ్యంగా యిది ప్రత్యేక శాస్త్రాలలో ఉదాహరణ ప్రాయమవుతూ వుంటుందని చెప్తుంది. ప్రాకృతిక, సామాజికశాస్త్రాలు, పరిపూర్ణత వేపు ముందుకు సాగుతూ వుంటే, మార్క్సిస్టు అన్వయంలో "శాస్త్ర ఏకత" అవుతాయి. ఆ క్రమంలో చారిత్రక భౌతికవాద శాస్త్రీయతను చాటుతాయి. ఆ రకంగా యిది సాధారణీకృతం అవుతూ, ఆ శాస్త్రాల ఆవిష్కరణలతో ఫలవంతం అవుతుంది. అయితే అప్పుడు గతితార్కిక భౌతికవాదం తత్వశాస్త్రం అవుతుందా? శాస్త్రం అవుతుందా?

ఈ సమస్యకు ఎంగెల్స్ వాదన "యాంటీ-డూరింగ్" రెండవ ప్రచురణ ముందుమాటలో, "పాత ముందుమాట" అని పిలిచేదాంట్లో వుంది. దీన్ని అసలు మొదటి సంపుటం కోసం రాశాడు. కాని తరవాత అక్కడకాక "ప్రకృతిలో గతితర్కం" అన్న వ్యాసాల సంకలనానికి చేర్చాడు. గతితార్కిక భౌతికవాదాన్ని ఒక తత్వశాస్త్రంగా పరిగణించే సాంప్రదాయక ధోరణిని ఆయన వాదన అంతగా వెనకేసుకు రాదనే చెప్పాలి. గతితార్కిక భౌతికవాదాన్ని రుజువుచేసే ధోరణి ప్రాకృతికశాస్త్ర పరిణామాలు, ప్రాకృతిక శాస్త్ర సైద్ధాంతిక పరిణామాలే నంటాడు ఆయన. సైద్ధాంతిక అనడంలో ఎంగెల్స్ ఉద్దేశం శాస్త్రాల భావనాత్మక పరిణామాలు అని, ప్రత్యేకించి భావనలకు సంబంధించి సాపేక్షంగా ఊహల పరిణామం. కచ్చితమైన అనుభవపూర్వక సాక్ష్యంవల్ల రుజువు అయినాగానీ దాన్ని దాటుకు ముందుకు పోవడం. అలాంటి భావనలు విడివిడి ప్రత్యేక శాస్త్రాల్ని ఐక్యం చేస్తాయి అని ఆయన అభిప్రాయం. అనుభవేతర భావనాత్మక ఏకత అనే యీ క్రమానికి, యింతవరకూ తత్వశాస్త్ర పరిధి

కిందకు వచ్చిన భావాలూ, నైపుణ్యాలూ అవసరం. ఎంగెల్స్ స్వయంగా యీ అంశాల్ని తత్వశాస్త్రం నుంచి, భౌతికవాదం, గతితర్కం తత్వశాస్త్రాల నుంచి పరిశీలించినా, ఆయనకి మరో ఆలోచనా వుంది. ప్రకృతి శాస్త్రాల లోపలనే జరిగే పరిణామాలు, క్రమశః "నా పనిని... ఆవశ్యకాతిరిక్తం చేస్తాయి" (యాంటీ డూరింగ్, రెండవ ఎడిషన్ ముందుమాట). ఆయన 'ప్రాకృతిక తత్వశాస్త్రం', "సిద్ధాంతపర ప్రాకృతికశాస్త్రం" అవుతుంది. ఆ రకంగా తత్వశాస్త్రమే అతిరిక్తం అవుతుంది. యేమంటే దాంట్లో విలువైందంటూ వున్నదాన్ని శాస్త్రం సంగ్రహించి శాస్త్రంగా మార్చివేస్తుంది.

## మార్క్సిస్టు మానవతావాదం, పాశ్చాత్య మార్క్సిజం

1920లలో, 30లలో రష్యన్ విప్లవం తిరోగమించి "డయామెట్" (గతితార్కిక భౌతికవాదానికి - డయలెక్టికల్ మెటీరియలిజం - యు.ఎస్.ఎస్.ఆర్‌లో వాడుకలో వున్న హ్రస్వరూపం) కమ్యూనిస్టు పార్టీ సంప్రదాయ బద్ధతకు ప్రధానం అయినప్పుడు యీ మొదటి మార్క్సిస్టు తత్వశాస్త్ర ఆధిపత్యం రెండవదానికి దారి తెరిచింది. యిది సుస్పష్టంగా నిర్వచితమైన సిద్ధాంతాల ఏకగుచ్ఛం కంటే యెక్కువగా ఒక ధోరణి, దూగ్గా ఏకీకృతం అయిన ధోరణి. దీని తొలి సిద్ధాంతవేత్తలు ల్యూకాక్స్, కోర్స్ లాంటివాళ్ళు. అయితే యిదే సమయంలో మార్క్స తొలి రచనల్ని తిరిగి ఆవిష్కరించడం జరిగింది. యీ కొత్త తత్వశాస్త్రానికి తోడ్పాటు అందిస్తున్నట్టు కనిపించింది, గతితార్కిక భౌతికవాదానికంటే, "డయామెట్" మొత్తంగా వాస్తవమైనదాన్ని గురించిన సిద్ధాంతంగా వుంది. ప్రజల్ని సమాజాన్ని విశ్వజనీన ప్రాకృతిక క్రమాన్ని ఉదాహరణప్రాయం చేసేటట్టు పరిగణించింది. సామాజికశాస్త్రం సమాజపు ప్రాకృతికశాస్త్రం అయినట్టుగా పరిగణించింది. అదలావుంటే యీ నూతన ధోరణి మానవత్వ పూరితంగా వుంది. పాత మానవత్వ పూరిత సిద్ధాంతం అయిన "మానవుడే సకల విషయాలకీ కొలబద్ధ" అన్నదాన్ని పునరుల్లేఖించడం మొదలైంది.

ప్రజలు సమాజం కేంద్రంగా, విశిష్టంగా వుండడం జరుగుతుంది అన్న అంశాన్ని పునరుద్ఘాటించింది. సామాజిక అవగాహనకి చెందిన ప్రకృతిశాస్త్ర నమూనాని యెదిరించడమేగాక, శాస్త్రాన్ని సాంకేతిక

పరిజ్ఞానాన్ని కూడా బూర్జువా అని నిలబెట్టి చాటింది. అవి బూర్జువా కావడంవల్ల పరాయీకరణ చెందేయి. పరిశోధన, ఆచరణలని చక్రం తిప్పే పద్ధతులు వచ్చాయి. 'పరాయీకరణ' అన్నది విలక్షణమైన హెగెలియన్ భావన. యిది యాంటీ దూరింగ్‌లో పూర్తిగా కనుమరుగైంది. మార్క్స్ "ఆర్థిక తాత్విక రచన"ల్లో ముఖ్యంగా వుంది (1844). యిప్పుడా భావన, ఆ రచనలాగానే, ముందు వీటికి వచ్చింది. దీంతోబాటే, అనుసంధించుకుని వున్న భావనలైన "పదార్థీకరణ" (Reification) వస్తు ఆరాధన (Fetishism) లాంటివీ ముందుకు వచ్చాయి. అయితే కేంద్రం మాత్రం కర్మలుగా కాక, కర్తలుగా ప్రజలు అన్న భావనే. అంటే చైతన్యానికీ, విలువలకీ కేంద్రాలు. ఆ రకంగా శాస్త్రం వర్ణిస్తున్నట్టు సహజ వ్యవస్థగా వున్న మిగిలిన వాటికంటే మౌలికంగా విభిన్నం.

గతితార్కిక భౌతికవాద విషయానికొస్తే మార్క్సిజం ప్రధానంగా శాస్త్రీయం. గతితార్కిక భౌతికవాదమే శాస్త్ర తత్వశాస్త్రం, 'ప్రాకృతిక తత్వశాస్త్రం'లాగా, "సైద్ధాంతిక ప్రాకృతిక శాస్త్రం" అభివృద్ధి చెందేకొద్దీ తత్వశాస్త్ర లక్షణం కోల్పోయి సంపూర్తిగా శాస్త్రీయం అవుతుంది. అందుకు భిన్నంగా మార్క్సిస్టు మానవతావాదం ప్రాథమికంగా శాస్త్రీయమైంది కాదు, తాత్వికమైంది. మానవత్వపూరిత తత్వశాస్త్రాల సంపూర్ణ దర్శనంలో నిబిడీకృతం అయిన యే శాస్త్రం మాదిరీ. యిందులోని యితివృత్తాలు వికాస యుగ హేతువాదానికి భావనాత్మక ప్రతిఘటనకి చెందిన సాధారణ సంస్కృతినే ప్రతిధ్వనిస్తాయి. అవి సంక్రమింపచేసుకున్న తాత్విక వారసత్వం కాల్పనికత్వానికీ (romanticism). జర్మన్ భావవాదానికీ అత్యంత సన్నిహితంగా వుంటుంది. కాంట్, హెగెల్, జర్మన్ "గీయెస్టెవిసెన్ స్కాఫ్ వెన్" (Geisteswissenschaften) వ్యాఖ్యానాత్మక తత్వశాస్త్రం జర్మన్ భావవాదంలో వున్నాయి. యివన్నీ కూడా ఒక విషయాన్ని అంగీకరిస్తాయి. మనకి తెలిసినట్టు వాస్తవికత అస్తిత్వంలో ఆ జ్ఞానానికి స్వతంత్రంగా వుండదు. కాని (పాక్షికంగా) దానితోనే యేర్పాటై వుంటుంది. శాస్త్ర ఏకత గురించి అనుభవవాద సిద్ధాంతాన్ని ముఖ్య భాష్యాత్మక దృష్టి నిరాకరించింది. మానవ వ్యవహారాల్ని సాంఘిక వ్యవహారాల్నీ అర్థం చేసుకోవడానికి అనుభవపూర్వక ప్రాకృతిక శాస్త్రానికి వర్తించే ఆ తర్కమే, అధ్యయన పద్ధతులే పనికిరావు అని వాదించింది.

భావాల్ని, భాషనీ అర్థం చేసుకోవడం సంఘటనల కార్యకరణ సంబంధ వివరణకంటే తక్కువ. నిజానికి సమాజభాషను అర్థం చేసుకోవడం చాలామట్టుకు సమాజాన్ని అర్థం చేసుకోవడమే. యేమంటే తమ భాషను అర్థం చేసుకోవడంలో ఆ ప్రజలు తమ సమాజాన్నే అర్థం చేసుకుంటున్నట్టు. యీ విషయాన్ని యే శాస్త్రమూ చిన్నచూపు చూడలేదు. ఆ అవబోధకు సంబంధించిన సైద్ధాంతిక వ్యక్తీకరణకి, ప్రయోగాత్మక పరిశీలన తాలూకు నిష్పాక్షిక వస్తు పరిశీలన కాదు కావాల్సింది, "తదనుభూతి". పరిశీలనలో వున్న ఆ సామాజిక కార్యకలాపాలతో కలిసిన అనుభూతి శక్తి లేదా భాగస్వామ్యం కూడా. అది అనుభవవాద, శాస్త్రీయ పద్ధతికంటే మరింత భావనాత్మకం, తాత్వికం అవుతుంది.

ఈ ధోరణులు ఫ్రాంక్‌ఫర్ట్ శాఖ రచనల్లో, సార్త్ర్ రచనల్లో, సమకాలీన యుగోస్లావ్ అసమ్మతివాద తత్వవేత్తల మార్క్సిజంలో కొంచెం యించుమించులో గట్టిగానే వెల్లడయేయి. కాని గత రెండు దశాబ్దాల్లో మార్క్సిస్టు మానవతావాదం, దాంతోబాటు మార్క్స తొలి తత్వశాస్త్రాన్ని హెచ్చుగా గణించడం మార్క్సిస్టు తత్వశాస్త్రం లోపలనే విమర్శకు గురైంది. ముఖ్యంగా అల్తూసర్, ఆయన అనుయాయుల్లో. వోల్పే (Volpe) ఇటాలియన్ శాఖలో మాదిరీ, అల్తూసర్ మార్క్సిస్టు మానవతావాదంలోని హెగెలియన్, భావవాద ధోరణుల్ని వ్యతిరేకించాడు. మార్క్సిస్టు సిద్ధాంతం మౌలికంగా శాస్త్రం అని ఆయన వాదించేడు. ఆ చారిత్రక భౌతికవాదంలో అంతర్గర్భితంగా మార్క్సిస్టు తత్వశాస్త్రం వుంది. దీన్ని విశ్లేషణ ద్వారా వెల్లడిచెయ్యాలి అనీ వాదించాడు. గతితార్కిక భౌతికవాదం మాదిరిగానే యీ మార్క్సిస్టు తత్వశాస్త్రం కూడా శాస్త్ర తత్వశాస్త్రం. అయితే దీనికి విభిన్నంగా అల్తూసర్ మార్క్సిస్టు తత్వశాస్త్రం "ప్రాకృతిక తత్వశాస్త్రం" కాదు. పురోగమించిన ప్రకృతి శాస్త్రాలతోబాటుగా మార్క్సిజం పాలుపంచుకునే ఒక ప్రపంచ దృక్పథం. ఓ రకంగా యిది శాస్త్రీయ తత్వశాస్త్రం గురించిన సంప్రదాయ భావనకు సన్నిహితంగా వుంది. అంటే జ్ఞాన మీమాంస (epistemology): "శాస్త్రం సైద్ధాంతిక ఆచరణ", తత్వశాస్త్రం "సైద్ధాంతిక ఆచరణకు సంబంధించిన సిద్ధాంతం". యేమైతేనేం, అల్తూసర్ ఆ తరవాత తను చేసుకున్న ఆత్మ విమర్శలో యీ

భావనకు పరిమితి చెప్పుకున్నాడు. శాస్త్రీయ తత్వశాస్త్రమే అయినప్పటికీ, మార్క్సిజం ప్రమాణాలు రూపొందించేదనీ (normative), భావజాలాత్మకం అయిందనీ, ముఖ్యంగా రాజకీయంగా వుందనీ, దానివల్ల యితర శాస్త్రాలతో విభేదిస్తుందనీ అన్నాడు. మార్క్సిస్టుశాస్త్రం కంటే భిన్నంగా మార్క్సిస్టు తత్వశాస్త్రం "చరిత్ర రంగంలో రాజకీయాలు", "సిద్ధాంతంలో వర్గపోరాటం." (అల్తూసర్ 1976.)

**తత్వశాస్త్రం, భావవాదం, భౌతికవాదం:**

మార్క్స్ బౌద్ధిక జీవితాన్ని తత్వశాస్త్రవేత్తగా ప్రారంభించాడు. భావాల రంగంలో బౌద్ధిక ఆధిపత్యం తత్వశాస్త్రానిదే. తత్వశాస్త్రానికి వున్న సంప్రదాయిక, కచ్చితమైన స్థానాన్ని ఆయన గుర్తించాడు. అయితే తొలి దశలో కూడా ఆయన ఆ స్థానం అంతేనా అన్న మీమాంసలో వున్నాడు. ఆ రకంగా తత్వశాస్త్రాన్నే చూడడమూ మొదలుపెట్టాడు. "తత్వశాస్త్ర పరిపూర్తి" అన్న భావాన్ని ఆమోదించాడు. అంటే అనుభవవాద శాస్త్రం వచ్చి నిగమ విధానంలో అధిభౌతికవాదాన్ని ప్రయోగవాదరూపంలో పక్కన పెడుతుందన్న అర్థంలోకాదు. అందుకు బదులుగా తత్వశాస్త్ర లక్ష్యం, పరిసమాప్తి దాన్ని విశిష్ట వాస్తవ రూపంలోకి తెచ్చుకోవడం ద్వారా దాని స్థానాన్ని తొలగించడం లేదా దాన్ని అతిరిక్తం చెయ్యడం అన్న భావనలో, అయితే తత్వశాస్త్రాన్ని "వాస్తవం" చెయ్యడం అనడంలో ఉద్దేశం వాస్తవంలోనని కాదు, మరో సిద్ధాంత రూపంలో వాస్తవం చెయ్యడం. అదే శాస్త్రం. అన్ని రకాల సిద్ధాంతాల్లోకీ వాస్తవానికి అత్యంత సన్నిహితంగా వున్నది శాస్త్రమే. వాస్తవాన్ని చిత్రీకరించడంలో అత్యంత సమర్థవంతమైంది శాస్త్రమే. తత్వశాస్త్రం అలాకాక తన తీక్షణమైన లోదృక్కుల్ని కూడా ఒక పద్ధతిగా వక్రీకరణకు గురిచేస్తుంది. యేమంటే తత్వశాస్త్రం సకల (యితర) భావాలనీ భావాల లోపలనే ప్రమాణీకరించే అన్వేషణతో వుంటుంది. ఆ రకంగా, సామాన్యంగా ఆలోచనకు శాశ్వతంగా వర్తించేటట్టు, కారణం నుండి కార్యాన్ని వూహించే తర్క పునాది వుండే భావాలకోసం అన్వేషణతో వుంటుంది. యిదుగో యీ అన్వేషణే కార్యకారణ తర్క నిశ్చితత్వానికీ, పూర్తి సంశయాత్మకతకీ (అంటే నిశ్చితత్వం సాధ్యం కాదు అన్న శంక) మధ్య తత్వశాస్త్రాన్ని

వూగులాడేటట్టు చేస్తుంది. తత్వశాస్త్ర ప్రమాణీకరణ శాసనం అనేది యేదీ శాస్త్రానికి వుండదు, అవసరమూ లేదు. సిద్ధాంతంలో అంతర్గతంగా శాస్త్రానికి పునాది అంటూలేదు. నిజానికి, సకల సిద్ధాంతానికీ ఆధారం భౌతిక వాస్తవికతలోనే వుంది. కాని సిద్ధాంతానికి వున్న రూపం ఒక్క శాస్త్రం మాత్రమే, వాస్తవాన్ని తగినంతగా ప్రతిఫలింపచేసే సామర్థ్యం వున్నది, దీన్నో దాన్నో గుర్తించేదీనూ. యితర సిద్ధాంత రూపాలకు వున్న భౌతిక పునాదివల్ల, అంటే తత్వశాస్త్రం లాంటివి, ఆ భౌతిక వాస్తవికతలో దేన్నో కొంతని అందించడంలో నెగ్గుకొచ్చాయి, అయితే మార్మికంగానే. తత్వశాస్త్రాన్ని అధిగమించడం ద్వారా, శాస్త్రం దాని పరిశీలనాంశాలని సంగ్రహించుకుంటుంది. కాని తనకి ఉచితమైన రూపంలోకి వాటిని మార్చుకుంటుంది.

భావవాదానికి వ్యతిరిక్తంగా మార్క్సు భౌతికవాదాన్ని ప్రతిపాదించాడు. తన చారిత్రక భౌతికవాద సామాజిక శాస్త్రాన్ని రూపొందించడంలో ఉదాహరణప్రాయం చేశాడు. యీ రెండింటినీ సంక్షేపించడంలో మార్క్సు పరిశీలన పరిధి, వాదం యిదే. మార్క్సు భౌతికవాదాన్ని ఒక **తత్వశాస్త్రంగా** ప్రతిపాదిస్తున్నాడన్న దృక్పథం ఆ రకంగా, మార్క్సిస్టు తత్వశాస్త్రం అనేది వుందన్న విశ్వాసానికి హేతువు అయింది. సాంప్రదాయిక భౌతికవాదం తత్వశాస్త్రం కావచ్చు. కాని మార్క్సు, ఎంగెల్స్‌ల అభిప్రాయాలకి మరింత అనురూపంగా వుండేది మరోలా కనిపిస్తుంది. అదేమిటంటే తత్వశాస్త్రం మతం నుంచి కొంచెం అటూ యిటూగా అవశేష భావవాదాన్ని నిలుపుకుంటుందని వాళ్ళకి తోచడం. ఆ రకంగా తాత్విక భౌతికవాదం, తాత్విక భావవాదం కంటే ముందడుగే అయినా, ఒక తత్వశాస్త్రంగా అది, యింకా భావాత్మకమే. ఆలోచనకు సంబంధించి దాని ఊహాత్మక పునాది భౌతిక యదార్థం కాదు. కాని (అతీతికమైనట్టు, అనుభవ గ్రాహ్యం కాని) భౌతిక వాస్తవికత గురించి అవసరం అయిన భావం. సంపూర్తి సంశయవాదానికి (యేదీ నిశ్చితం కాదు అన్న దానికి) తాత్విక ప్రత్యామ్నాయం సర్వదా యేదో సత్తాశాస్త్రం (ontology) అధిభౌతికవాదం (metaphysics) లేదా జ్ఞాన మీమాంస (epistemology) అనేవిగా వుంటున్నాయి. భౌతిక వాస్తవికతలో, ఆమోదయోగ్యమైన పునాదిగా వున్న తత్వశాస్త్రేతర

ప్రత్యామ్నాయం శాస్త్రమే. శాస్త్రానికి యదార్థం గురించిన జ్ఞానం సాధ్యమే. కాని భావనాత్మక చట్రంలో యెంత లోతుగా పాదుకున్నప్పటికీ, యే భావమూ కూడా సంపూర్తిగా నిశ్శంకగా వుండదు. సకల భావాలకీ కట్టకడపటిగా ధ్రువీకరణ వుండాలి. యెంత పరోక్షంగానేనా, శాస్త్రీయంగా, వాస్తవంతో అవి తూగుతున్నాయా అన్న ప్రమాణం అవసరం.

అనూచానంగా వస్తూ వున్న జ్ఞాన మీమాంసకి సంబంధించి జ్ఞానం అంటే తెలిసిన వస్తువుతో పోలిస్తే యేదో ఒకదాన్ని అధీనంలో వుంచుకోవడం అన్నదే. జ్ఞానం అనేది కర్త మనసులో ఆ వస్తువుకు చెందిన భావం అన్నది. అయితే భౌతికవాదానికి ఆ వస్తువు రూప నిష్పత్తుల ఉదాహరణలాగా "భౌతిక వస్తువు" లేదా "పదార్థం" తత్వశాస్త్రం కర్త భావాలలోపల ప్రామాణిక ఆరంభ బిందువు. అవసరం బట్టి "భావాల పద్ధతి"కి సాధారణంగా దాని నిబద్ధతని బట్టి చూస్తే, భావాలకు బయట, వాటికి స్వతంత్రంగా వుండే పాదార్థిక వస్తువు గురించి అలాంటి భావాలు జ్ఞానంగా యెలా అవగలవు అన్న సంశయం తలెత్తుతుంది. తాత్విక భావవాదం అలాంటి వస్తువు యేదీ లేదు అంటుంది. హెగెల్ భావవాదానికి జ్ఞాన వస్తువు పాదార్థికమైందికాదు, ఆదర్శం. మనసు నుంచి పుట్టుకొచ్చింది లేదా జీవాత్మనుంచి. తన కార్యకలాపంలో ఆ మనసు లేదా జీవాత్మ వస్తుగతం అవుతుంది లేదా పరాయీకరణ చెందుతుంది. పరాయీకరణలో లుప్తత, భ్రమ వుంటాయి. 'తన' అనేది పోతుంది. ఆ పోయినది జీవాత్మ స్వయం సృష్టి కాదు, మరేదో. దీంతో హెగెల్ చారిత్రక పునఃగ్రహణ లేదా పునరైక్యం సాహసయాత్రకు రంగం సిద్ధమవుతుంది. అది చైతన్యంలో అంతర్గతంగా వున్న జ్ఞేయ సాహస గాథ. యిది పరమజ్ఞానం అన్న గమ్యంకేసి నడిపిస్తుంది.

మార్క్స్ యీ తాత్విక భావవాదాన్ని దాని తాత్విక ప్రతిభాగం అయిన తాత్విక భౌతికవాదంగా పరివర్తన చెయ్యకుండా, సమాజపు శాస్త్రీయ అంశాలుగా పరివర్తన చేశాడు. యీ క్రమంలో ఆయన ఒక ప్రత్యేక భౌతికవాదాన్ని అభివృద్ధి చేశాడు. పాదార్థికమైన భావనకు పదార్థం నుంచి (భౌతికమైన) ఆచరణకు బదలాయించాడు. భౌతికశాస్త్రాలు ప్రకృతి గురించి పొందిన జ్ఞానం ఒక వస్తువుంది. అది

ఆ జ్ఞానమే ధ్రువపరుస్తున్నట్టు చైతన్యానికి బాహ్యంగా వుంటుంది, దాన్నుంచి స్వతంత్రంగా వుంటుంది. తాత్విక భౌతికవాద విషయం గురించి అంతమాత్రమే అంగీకరించడంలో, మార్క్స్ వైయక్తిక కర్త - కర్మ సంబంధాన్ని దానికి ఆధారంగా తిరస్కరిస్తాడు. హెగెల్‌ని అనుసరిస్తూ, ఆయన జ్ఞాన సముపార్జన అనేది ఉత్పత్తి సంబంధ క్రియాశీల సామాజిక - చారిత్రక క్రమం అని నొక్కి చెపుతాడు. కాని దీనికి భౌతికవాద భాష్యం చెపుతాడు. జ్ఞానం వస్తువు మానసిక కార్యకలాపం నుంచి వచ్చిన సంగ్రహణ. అంటే మానసిక కార్యకలాపం (భౌతిక) ఆచరణ నుంచి వచ్చిన భావం. అంతిమంగా భౌతిక వస్తువుల ఆర్థిక ఉత్పత్తి నుంచి వచ్చినటువంటిది. ఆలోచనకీ, పదార్థానికీ సంప్రదాయికంగా వున్న ద్వైతం ఆ రకంగా భౌతిక ఆచరణ ద్వారా మధ్యవర్తిత్వం పొందింది. యిది ప్రకృతి గురించిన మన జ్ఞానానికి నిరంతర నియమం. అయితే సామాజిక శాస్త్రానికి సాంఘిక - చారిత్రక కార్యాచరణ అనుల్లంఘనీయమైన నియమం మాత్రమే కాదు, జ్ఞానానికి లక్ష్యం కూడా. శాస్త్రీయ జ్ఞానానికి లక్ష్యంగా సమాజం, ఆచరణల నిర్మాణం. దీని పునాది భౌతిక ఆచరణ. మనం ప్రకృతిని సృష్టించక పోయినా శుద్ధ మానసిక కార్యకలాపం ద్వారా అలా చెయ్యడం భావవాదం చెప్పినట్టు ఖాయంగా కుదరకపోయినా, మానవ సరకుల్ని, కళాఖండాల్ని ఉత్పత్తి చేస్తాం. ఆ రకంగా ఉద్దేశ్యపూర్వకంగా కాకపోయినా మన సామాజిక సంబంధాల్నీ, ఆ రకంగా సమాజాన్నీ సృష్టిస్తాం. యిక్కడ నిజానికి, ప్రాకృతికమైన వస్తువుల నుంచి కాకపోయినా సామాజిక వస్తువుల నుంచి, కార్యకలాపాల నుంచీ పరాయీకరణ వుంది. నష్టం, భ్రమ, లొంగుబాటు యిమిడి వున్న సంబంధం: ఉదాహరణకు శ్రమ సరకుల్ని ఉత్పత్తి చేస్తుంది. వాటిని పెట్టుబడి స్వాయత్తం చేసుకుంటుంది. ఆ రకంగా అవి శ్రమ ఉత్పత్తులుగా గాక పెట్టుబడి ఉత్పత్తులుగా కనిపిస్తాయి ఉత్పత్తిదారుడ్ని ఉత్పత్తి సరకు నియంత్రిస్తోంది, ఉత్పత్తిదారుడు ఉత్పత్తి సంరక్షకుని నియంత్రించడం కాక. అసలు సమాజమే పరాయీకరణ అయిన ఉత్పత్తి. అందులో వున్న సభ్యులకు, మార్చడం తమ వశంలోలేని వస్తువుగా కనిపిస్తుంది. కానైతే యీ పరాయీకరణను తాత్వికంగా అర్థం

చేసుకోవడానికి లేదు, మానవ పరిస్థితి శాశ్వత అంశంగా చూడరాదు. శాస్త్రీయంగా బోధ పరచుకోవాలి. మార్పు చెయ్యదగ్గట్టు వున్నదిగా చూడాలి. అదీగాక ఆ మార్పులో శాస్త్రం ఫలవంతమైన ఆచరణాత్మక పాత్ర పోషించగలదు, పోషించాలి. సామాజిక నిర్మాణ ఏకత వైరుధ్యపూరితం. వైరుధ్యపూరిత వర్గ నిర్మాణం, వైరుధ్యపూరిత ఉత్పత్తి విధానం, దీని పునాది పెట్టుబడిదారీ విధానం. యీ వైరుధ్యాల ఘర్షణల వల్ల సమాజం విప్లవపూరిత సన్నివేశం వేపు సాగుతోంది. యీ సన్నివేశంలో శ్రామికవర్గం, తన సైద్ధాంతిక భావజాలంగా మార్క్సు శాస్త్రంతో సాయుధమై యీ వైరుధ్యాల్ని రద్దుచేస్తుంది. సామాజిక వ్యవస్థను తన ఆధిపత్యం కిందకు తెచ్చుకుంటుంది. ఆ క్రమంలో శ్రామికవర్గం తననీ, తనతోబాటు సామాన్యంగా మానవాళినీ విముక్తం చేస్తుంది.

## శాస్త్రీయ వాస్తవికత, గతితర్కం

సాంప్రదాయకంగా వున్న జ్ఞాన సిద్ధాంతంలో వున్న కర్త - కర్మ సంబంధాన్ని తిరస్కరించాడు మార్క్సు. అలా తిరస్కరించడంలో జ్ఞాన సిద్ధాంతంలో వున్న ప్రత్యేక రూపాన్ని తిరస్కరిస్తున్నాడు. ఆయన ఒకే భావనతో అలా చేస్తున్నాడు. యెలా అంటే ఆయన శాస్త్రం అనే ఆధునిక తత్వశాస్త్రం నుంచి తోడ్పాటు అందుకుంటూ, అనుభవాధార శాస్త్రాన్ని (empiricism) తగ్గించడమే కాక, దాంతోబాటు భాష్యాత్మక ప్రత్యామ్నాయాన్నీ తగ్గించి చూస్తున్నాడు. అదీగాక భాషా సిద్ధాంతంలో విట్‌గెయిన్ స్టైన్ తాత్విక పద్ధతి పునాదినీ తగ్గిస్తున్నాడు. మార్క్సు ఒక ప్రాచీన తాత్విక సిద్ధాంతాన్ని గ్రహించి, మార్పు చేశాడు. అది ప్రఖ్యాతంగా ప్లేటోలో దర్శనమిచ్చింది. దాన్ని తీసుకుని, సమాజపు ప్రయోగాధారంగా పైకి కనిపించే రూపం, ప్రకృతిలో లాగానే, బాహ్యమైనదే. దీన్ని దాని అంతస్సారంలో వున్న యదార్థం కొట్టిపారేస్తుంది. వాస్తవంగా, కాని బాహ్యంగా కనిపించే రూపాలే, సమాజంలోని వ్యక్తుల సద్యోపూరిత భావాల్లో నిలదొక్కుకుంటాయి. అలా నమోదైనవి సామాన్య భాషలో భావనాత్మకం అవుతాయి. ఆ రకంగా, కొంచెం అటూ యిటూగా నిర్ణాయకంగా సమాజపు సైద్ధాంతిక కృషిలో

ప్రవేశించి, ప్రభావితం చేస్తాయి. మార్క్స్ ప్రకారం శాస్త్రీయ సిద్ధాంతపు అసలు విధి యదార్థ పరిస్థితి అనుభవపూర్వక బాహ్యరూపంలోకి చొచ్చుకుపోవడం, "నిజమైన సంబంధాల్ని" ఆవిష్కరించడం. అంతర్గతంగా వున్న నిర్మాణాల్నీ, శక్తుల్నీ శోధించడం. యివే పైకి కనిపించే ఆ రూపాల్ని సృష్టిస్తాయి. అవే యదార్థమైన మౌలిక చారిత్రక ధోరణులు. శాస్త్రంలోవున్న సైద్ధాంతిక భావనలు ఆ రకంగా పరిశీలించగలుగుతూ వున్న భావనలకీ కుదించడం వుండదు, అనుభవవాదంలో మాదిరీ; అలాగని సిద్ధాంతవేత్తలు యదార్థం మీద రుద్దుతున్న స్వీయ నిర్మాణాలకీ కుదించడం వుండదు, భావవాదుల మాదిరీ. అవి, కొంచెం హెచ్చుతగ్గుల్లో యదార్థపు పరిశీలనా లక్షణాల్ని (పదార్థపు) కచ్చితంగానే వర్ణిస్తాయి. శాస్త్రం గురించిన మార్క్స్ భావన వాస్తవికం. యిలాగని యిటీవల వచ్చిన ఇంగ్లీషు బృందం మార్క్సిస్టు తత్వవేత్తలు చెపుతున్నారు. (భాస్కర్, మెర్థమ్, రూచెన్-1979.)

అంటే మార్క్స్‌కి సంబంధించి అభివృద్ధి చెందిన శాస్త్రంలో సంపూర్తిగా ప్రయోగాధారమూకాని, కారణం నుండి కార్యాన్ని వూహించడమూ కాని (నిగమ పద్ధతి) భావనలు కలిసి వుంటాయి. అవి నిర్దిష్ట అనుభవపూర్వక రుజువులకు ఆవల వుంటాయి. అయినా "తాత్వికంగా"గాక శాస్త్రీయంగా నిలబడతాయి లేదా జారిపోతాయి. కొంచెం అటూ యిటూగా యదార్థానికి తూగే భావనాత్మక చట్రంలో భాగంగా వుంటాయి. శాస్త్రీయ పద్ధతిలో కీలకమైన అంశం భావనాత్మక విమర్శ, నూతన రీతుల కల్పన అనేవి అన్నీ అనుసరించి వస్తాయి. మార్క్స్ శాస్త్రం నిశ్చిత చారిత్రక, సాంస్కృతిక పరిస్థితిలో సాంఘిక కార్యకలాపం. ఆ రకంగా అది సామాన్య భాషలోని భావనలనీ, అస్తిత్వంలో వున్న సిద్ధాంతాలనీ విమర్శనాత్మక పరిశీలనకు పెడుతుంది. యీ ముడిసరుకును మేధోశ్రమ ద్వారా మరింత సముచితమైన సైద్ధాంతిక ఉత్పత్తిగా మారుస్తుంది. కాని చలామణీలో వున్న భావాలు సమాజంలో భాగమే. ప్రాకృతికం కాకపోయినా సామాజికశాస్త్రంగా ఆ వస్తువును బోధపరచుకుని వివరించాలి. కాబట్టి మార్క్స్ శాస్త్రం, ఆ భావాలని విమర్శనాత్మకంగా వ్యతిరేకిస్తూ, వాటిని వాటి భౌతిక పరిస్థితుల దొంక దాకా లాక్కుపోయి వివరించ చూస్తుంది. మార్క్స్ యిక్కడ ఒక

ప్రలోభానికి లొంగిపోదు. అది "జ్ఞాన సామాజికశాస్త్రం"లో యెంతో బలంగా వున్నటువంటిది. అదేమిటీ అంటే, ఆలోచన విషయకమైన భౌతిక వివరణ, దాని జ్ఞేయగ్రహణతో పొసగనప్పుదు, ఆ రకంగా ఒక అసంగతమైన సంశయాత్మక సాపేక్ష వాదాన్ని ఆలింగనం చేసుకోవడం. తద్భిన్నంగా ఆయన మరో అంశాన్ని వెల్లడించాడు. భౌతిక పరిస్థితుల అవసరం దృష్ట్యా పుట్టుకొచ్చిన భావాలు గ్రహణకు లోపభూయిష్టంగా వుండడం యెలా జరుగుతోందీ అన్నదాని జాడతీస్తూ ఆయన యిలా వెల్లడించాడు. సమాజం, ముఖ్యంగా ఆధిపత్యంలో వున్న ఆ సమాజపు ఉత్పత్తి విధానంలో, మార్మికం చేసే వస్తువుగా వుంటుందనీ, ఆ రకంగా లోపల దాగివున్న యదార్థాన్ని దాచిపెట్టే బాహ్య రూపాన్ని సృష్టిస్తుందనీ, అలా ఆ సమాజంలో వున్న వాళ్ళని మాయచేసి, అయోమయానికి గురిచేస్తుందనీ వెల్లడించాడు. (మార్క్స్ "పెట్టుబడి", 1, అధ్యాయం 1, విభాగం 4. "సరుకు పూజ" The Fetishism of Commodities). యిలా వస్తుగతంగా మార్మీకరించడం ఒక క్రమంలో భాగం, ఆ రకంగా సమాజం పునరుత్పత్తి చెందుతూ వుంటుంది. ఆ రకంగా దానికి ఒక రాజకీయ కర్తవ్యం వుంది, వర్గపోరాటంలో పాలకవర్గాన్ని బలపరుస్తూ వుంటుంది. అంచేత యితర భావాలనీ, సిద్ధాంతాల్నీ గురించిన మార్క్స్ శాస్త్రీయ విమర్శనే రాజకీయం అవుతుంది. ఆ సిద్ధాంతాలూ, భావాలు బూర్జువా భావజాలం అని ఆయన వెల్లడిచేశాడు. వాటిని విమర్శించడం ద్వారా వాటిని అవసరం చేస్తున్న భౌతిక పరిస్థితుల్ని విమర్శిస్తున్నాడు: "తమ భ్రమల్ని వదులుకొమ్మని వాళ్ళకి పిలుపు యివ్వడం అంటే అర్థం భ్రమలకు అస్కారమైన పరిస్థితుల్నీ వదిలించుకొమ్మని చెప్పడం" (క్రిటిక్ అఫ్ హెగెల్స్ ఫిలాసఫీ అఫ్‌రైట్: ఇంట్రడక్షన్). యీ రకంగా మార్క్స్‌శాస్త్రం బూర్జువాశాస్త్ర తత్వశాస్త్రంలో ఆయువుపట్టు సూత్రాన్ని ఖండిస్తోంది. వస్తువుకు సంబంధించిన శాస్త్ర విలువ తాటస్థ్యాన్ని తిరస్కరిస్తోంది. అది కూడా బూర్జువా భావజాలమే అని వెల్లడైంది. అయితే యీ లోపభూయిష్టమైన భావాలని లేదా వాటిని మార్మికం చేసే భౌతిక పరిస్థితులను సైద్ధాంతిక విమర్శతోనే మార్చవచ్చునే ఊహతో మార్క్స్ భౌతికవాదం పొసగదు. ఆయన శాస్త్రం "విప్లవం" అన్నదాంతో (థీసెస్ ఆన్ ఫోయెర్ బాఖ్) సారూప్యం చెందే ఆచరణాత్మక –

విమర్శనాత్మకమైన దాంట్లో భాగం. సోషలిస్టు ఉద్యమం నుంచి దీన్ని విడదియ్యడానికి లేదు, అందులో అంతర్భాగం. యీ ఉద్యమం పెట్టుబడిదారీ విధానాన్నీ, బూర్జువా సమాజాన్నీ కూలదోస్తుంది. మార్క్సు శాస్త్రం శ్రామికవర్గ దృక్పథం నుంచి శాస్త్రం. ఆ రకంగా యిది యే పాలక పక్షమేనా గ్రహించగలిగేటట్టు వుంటుంది. యే యితర వర్గమూ అధిగమించి పోలేని వర్గానికి విశిష్టంగానూ వుంటుంది. దీని శాస్త్రీయత శ్రామికవర్గ భావజాలంతో పొసుగుతూ వుండడమే కాదు, దీని హోదా కూడా అదే. ఆల్తూసర్‌కి భిన్నంగా యిది ఒక శాస్త్రం, తత్వశాస్త్రం కాదు, "వర్గపోరాట సిద్ధాంతంలో" మార్క్సిస్టు పార్శ్వం అవుతుంది.

ఈ సంబంధాలు భౌతికవాద రూపంలో గతితర్కంతో సిద్ధాంతీకృతం అవుతాయి. బూర్జువా తత్వశాస్త్ర దృక్కోణం నుంచి, మార్క్సు అందుకున్న కీలకమైన, హానికరమైన చర్య యేమిటీ అంటే తార్కిక అభివర్గమైన వైరుధ్యాన్ని ఆలోచన నుంచి భౌతికవాద యదార్ధానికి తీసుకుపోవడం. యీ చర్య యింతకు ముందు చూసిన వాదనలో భాగంగానూ, పరాయీకరణ, సరకుపూజ భావనల సాధారణీకరణగానూ బోధపడుతూనే వుంటుంది. యీ రీత్యా, జడవస్తు యదార్ధాన్ని అధ్యయనం చేసే ప్రాకృతిక శాస్త్రాలతో సామాజికశాస్త్రం విభేదిస్తుంది, వాటి సారూప్యతలు యేమైనా కానీ. ఆలోచన దానికిగా యదార్ధంలో భాగం. అది సామాజికశాస్త్ర లక్ష్యం. అంటే సమాజం. అంచేత అలాంటి ఆలోచనను జ్ఞేయంగా (శాస్త్రీయంగా) మూల్యాంకనం చెయ్యడం, విమర్శించడం మాత్రమే కాదు, వివరణాత్మకంగా, దాని భౌతిక పరిస్థితుల నుంచి, బోధపరచుకోవడమూ వుండాలి. భౌతిక జీవితాన్నీ శ్రమనీ రూపొందించే మౌలిక నిర్మాణాలూ, శక్తులూ మేధోశ్రమనీ, మానసిక జీవితాన్ని కూడా రూపొందిస్తాయి. ఆ రకంగా యదార్ధాన్ని వెల్లడిచేసే వస్తువును ప్రతిఫలింప చెయ్య చూడడంలో, ఆలోచన, భౌతిక కార్యాచరణను ప్రతిఫలింపచేస్తుంది. అది గర్భితంగా, నిర్మాణాత్మక మార్గాల్లో, అదే గుర్తించలేనట్టు జరుగుతుంది. ఆలోచనకీ, ఆచరణకీ మధ్య వున్న యీ వివరణాత్మక సంబంధం భావాలను విశ్లేషించే అవకాశానికి ఆధారం కలిగించవచ్చు. అది యదార్ధంలో ఉన్న రహసాల్ని విప్పి విశదం చేసేటట్టు ఉండచ్చు. యిక మరింత ముఖ్యం

అయిందేమిటంటే యిది ఒక మార్గాన్ని అందిస్తుంది: అదేమిటీ అంటే, దానిగుండా భావాల విమర్శ, (భౌతిక) ఆచరణల విమర్శతో కలవడం ఆ భౌతిక ఆచరణలే కదా ఆ భావాల్ని సృష్టించిపెట్టేది. యిదే వైరుధ్యాల గతితార్కిక భావనని బట్టి "ఐక్యం" అన్న అభివర్గం అవుతోంది. యిందులో పరాయీకరణ ప్రత్యేక సందర్భంగా వుంటుంది. వైరుధ్యం అనేది విమర్శనాత్మక అభివర్గంగా శాస్త్రంలో వుంటుంది. ఒక తార్కిక అభివర్గం. యిందులో అది వర్తించే దాంట్లో వున్న అతార్కికతనీ, అహేతుకతనీ గర్భితం చేసుకుని వుంటుంది. గతితార్కిక శాస్త్రానికి సంబంధించి, భ్రమనీ మార్మికతనీ పొదువుకున్న వైరుధ్యపూరిత ఆలోచన పద్ధతులు నిర్మాణాత్మక అహేతుకతల్ని ప్రతిబింబిస్తాయి. యీ అహేతుకతలు (భౌతిక) ఆచరణ వైరుధ్యం, అది తనలోతానే స్ఫర్థిస్తూ వుంటుంది. మౌలికంగా, అందులో భాగస్వామ్యంతో వున్న భావాలని గజిబిజి చేసి, మార్మికం చేసే ఆచరణాత్మక అహేతుకతలు లేవు. అంచేత మార్క్స్ విమర్శ ఒక రకమైన మూల్యాంకనంతో వుంది. యిది నైతికత అన్న విభజన కిందికి రాదు, హేతుబద్ధత అన్న వర్గీకరణ కిందికి వస్తుంది.

ఈ నిజమైన సామాజిక వైరుధ్యాలు, యేమైనప్పటికీ "తాత్విక" పరమైనవికావు. మానవ స్థితిగతులలో శాశ్వత భాగం కాదు. కాని చారిత్రకంగా నిర్దిష్టం. యిదే విషయం సంబంధిత యితర తాత్విక సూత్రాలకీ వర్తిస్తుంది. విప్లవం సమాజంలో వున్న నిర్మాణపర వైరుధ్యాల్ని తొలగిస్తుంది. దానివల్ల ఆ సమాజం నిర్మాణం మరింత హేతుబద్ధంగా వ్యవస్థీకృతం అవుతుంది. ఆ సమాజంలో వాళ్ళు నియంత్రించుకుందుకు మరింత సానుకూలంగా వుంటుంది, వాళ్ళ సద్యోజనిత చింతనకు మరింత సుబోధకంగా వుంటుంది. (మార్క్స్ "పెట్టుబడి" 1. అధ్యాయం 1. భాగం 4. "సరకుపూజ"). భాష్యాల సత్యం, తాత్విక రూపంలో కాదనుకోండి, గ్రహణకు వస్తుంది. అదే రకంగా అనుభవవాద సత్యమూనూ. యేమంటే శాస్త్రీయ వాస్తవికతను అధిగమించడం జరుగుతుంది. సమాజం బాహిరంగా కనిపించేదానికీ, అంశీభూతంగా వున్న అంతస్సారానికీ మధ్య వున్న వైరుధ్యం అదృశ్యం అవుతుంది. దాంతోబాటే సమాజపు మార్మిక స్వభావమూ అదృశ్యం అవుతుంది.

అప్పుడిక యెంతమాత్రమూ సిద్ధాంత అవసరంకాని, అవకాశంగాని వుండవు, అంటే సామాజికశాస్త్ర సంబంధమైన అని. (కోహెన్ 1978.)

ఈ ప్రణాళిక భౌతికవాద, భావవాదాలకు సంబంధం విషయంలో తత్వశాస్త్రం గురించి మార్క్స్, ఏంగెల్స్‌ల అభిప్రాయాల్ని, పరమ అంతరార్థాన్ని వెల్లడిచేస్తూ దాన్ని ఉచిత స్థానంలో పెడుతుంది.. మార్క్స్ భౌతికవాదం అంతిమ విశ్లేషణల్లో ఆదర్శపూరితమే మతం, తత్వశాస్త్రం అనేది. మొత్తంగా సిద్ధాంతమే దానికిగా, యింకా చెప్తే సామాజికశాస్త్రంతో సహా, యీ కడపటి విశ్లేషణలో యిలా వుంటుంది: సకల శ్రమ విభజన రూపాలలోనూ అత్యంత కీలకమైనది యిక్కడ కావాలి. మానసిక శారీరక శ్రమల మధ్య విభజన. దాంతోబాటే మార్మికం చేసే, పరాయీకరణ కావించే సమాజమూనూ. మన యీనాటి యుగంలో శాస్త్రం తత్వశాస్త్రాన్ని యిముడ్చుకుని, అధిగమిస్తోంది. తత్వశాస్త్రం వస్తువును మరింత భౌతికవాద వస్తువుతో, రూపంతో, అస్తిత్వ విధానంతో వుండే సిద్ధాంతానికి వస్తువుగా శాస్త్రం మార్చేస్తోంది. కానైతే పరిపూర్ణ సామాజిక భౌతికవాదం అనేదాన్ని ఆచరణలో, ఆచరణగా చారిత్రకంగా అందుకోవలసిందే. అది సామాజిక ఆచరణ. దాని గ్రాహ్యత, పారదర్శకత, సిద్ధాంతం లేకుండానే సద్యోజనిత ఆలోచనకు దాన్ని అవబోధకు అందిస్తాయి. అంచేత, యెంత శేషమాత్రమైనదైనా గానీ, ఆ ఆదర్శం, ఆచరణశీల జీవిత రూపం నుంచి యేదో వేర్పాటు అవసరమయే కార్యకలాపం నుంచి విడదియ్యలేనట్టు వుంటుంది. (థీసెస్ ఆన్ ఫోయెర్‌బాఖ్ ముఖ్యంగా ఎనిమిదవది).

# భావవాదం

మార్క్స్ భావవాదాన్ని జడవాద, చారిత్రక, నైతిక రూపాల్లో వ్యతిరేకించా డు. జడవాద భావవాదం యదార్థాన్ని దర్శించే తీరు (పరిమిత, అపరిమేయ) మనసు లేదా భావాల (విశిష్టంగాని, అతీతంగాని) మీద ఆధారపడి వుంటుందనిగాని, లేదా వాటితో వుంటుందని గాని చెపుతుంది. చారిత్రక భావవాదం చారిత్రక పరివర్తన మౌలిక లేదా ఏకైక చోదకం కర్తృత్వంలో, భావాలలో లేదా చైతన్యంలో వుంటుందంటుంది. యిక నైతిక భావవాదం కార్యాచరణను

నిర్ణయించడానికిగాని లేదా హేతుబద్ధం చెయ్యడానికి ప్రయోగ పూరితంగా నేలమీద ఆనని (ఉన్నత లేదా మేలైన) పరిస్థితిని మార్గంగా ముందు పెడుతుంది. మార్క్సుది భావవాద వ్యతిరేకం లేదా భౌతికవాదం. యిది భావాల ఉనికిని గాని లేదా కార్యకారణ ప్రయోజన పుష్టతనుగాని తిరస్కరించదు. (తద్భిన్నంగా కుదింపు భౌతికవాదానికి భిన్నంగా యిది భావాల ఉనికిని నొక్కిచెప్పింది). కాని వాటికి ఆపాదించిన స్వతంత్ర అస్తిత్వాన్నిగాని, వివరణాత్మక ప్రాధమ్యాన్నిగాని అంగీకరించదు.

1843 నుంచి 1847 దాకా రాసిన మార్క్సు రచనల్ని భావవాద విమర్శనగా, సమాలోచనగా పరిగణించవచ్చు. వాటిలో ఆయనా, ఏంగెల్స్ యిద్దరూ తక్షణమే తమ "పూర్వతాత్విక అంతరంగం"తో వ్యవహారం పరిష్కారం చేసుకున్నారు. తమ శాస్త్రీయ తరహా పరిశోధనలకు శ్రీకారం చుట్టేరు. యీ సమాలోచనని ఒక ద్వంద్వగతిలో కూర్చడం జరిగింది: మొదటిది, విశిష్టంగా ఫోయెర్ బాఖ్‌యం. పరిమిత సాకార మనసుల ద్రవ్యాలుగా క్షణిక భావాలు స్థాపితమైవుంటాయి; రెండవది ప్రత్యేకించి మార్క్సుకి చెందింది. యీ మనసులు చారిత్రకంగా అభివృద్ధి చెందుతూ వున్న సామాజిక సంబంధాల ఉత్పత్తులుగా స్థాపితమైవుంటాయి.

మార్క్సు మొదటిదాంతో తలపడుతూ వున్నప్పుడు తొలిగా అది హెగెలియన్ గతితర్కం మీద లగ్నం అయింది. హెగెల్ కర్త - కర్మ అనులోమత్రయం మీద సమాలోచనతో నిండి వుంది. హెగెల్ అపరిమేయ భావవాద సత్తాశాస్త్రం మీదకి గురిపెట్టుకుంది. అలాగే ఊహాత్మక తార్కిక జ్ఞాన మీమాంస మీద, తత్వతః భావవాద సామాజికశాస్త్రం మీద, అనులోమ అంశాల పై హెగెలియన్ సాదృశ్యం మీద గురిపెట్టుకుంది - మొదట, అస్తిత్వాన్ని తెలుసుకోవడం అనేదానికి కుదించడం. దీని గూఢ నిబంధననే మార్క్సు అవిమర్శక పోజిటివిజమ్‌గా వేర్పాటు చేశాడు. ఆ తర్వాత శాస్త్రాన్ని తత్వశాస్త్రానికి కుదించడం. దీని పర్యవసానమే మొత్తం భావజాల నమ్మత. మార్క్సు భావవాదపు ఫోయెర్ బాఖ్‌య సమాలోచన ముగించాక, స్థిరమానవ స్వభావం అన్న ఫోయెర్ బాఖ్ సమస్య స్థానంలో మానవ సాంఘికీకరణను అభివృద్ధిచేసే చారిత్రక భౌతికవాద సమస్యను తెచ్చాడు. "మానవ సారాంశం అనేది ప్రతి విడి వ్యక్తిలోనూ అంతర్గతంగా వున్న

సంక్షేపం కాదు. యిది యదార్థానికి సాంఘిక సంబంధాల సమష్టి" (ఫోయెర్ బాఖ్ మీద సూత్రీకరణలు. 6). యిదే సమయంలో, చరిత్ర అనేది "మానవ కార్యకలాపం తమ లక్ష్యాల కోసం చేసే అన్వేషణ తప్ప మరేమీ కాదు" (పవిత్ర కుటుంబం) అనీ అన్నాడు. అత్యంత ముఖ్యమైన వ్యక్తిత్వంగా, ఇచ్ఛానువర్తనను మూర్తీభవీకరించడంగా సత్తావాద శుద్ధతత్వాన్ని తొలగించడానికీ ఆతృతపడ్డాడు. యేమంటే మానవ 'ఆచరణ' లేదా శ్రమ అనేవాటిలో సామాజిక రూపాల పునరుత్పత్తి, పరివర్తనని సామాన్యంగా చరిత్రక్రమాన్ని ఆయన భావనలో రూపొందుంచుకుంటూవున్నాడు.

ఎంగెల్స్, లెనిన్ ఉభయులూ సంశయవాదానికీ, స్వీయభావవాద ధోరణికీ వ్యతిరేకంగా ఉద్ధృతంగా వాగ్వివాదాలు సాగించారు. అలా చేస్తూ వుండగానే వాళ్ళు ప్రారంభించిన గతితార్కిక భౌతికవాద సంప్రదాయం మొండి నమ్మక స్థాయికి, మననాత్మక భౌతికవాద స్థాయికి దిగజారింది. యిక అటుపక్క ల్యూకాక్స్, కోర్ష్‌లు ఆరంభించిన "పాశ్చాత్య మార్క్సిజం", మార్క్స్ భౌతికవాదంలోని కర్తృత్వ, విమర్శనాత్మక పార్శ్వాలని నొక్కిచెప్పింది. చెపుతూ, యేదోవొక రకపు జ్ఞాన మీమాంసా పూర్వక భావవాదానికి మొగ్గింది. మార్క్స్ చెప్పిన "నైతిక సహజవాదాన్ని" రెండవ ఇంటర్నేషనల్ నాటి కాంట్ పక్షీయులూ, చాలామంది మానవతావాద అస్తిత్వవాద తత్వవేత్తలూ ఉభయులూ కూడా తిరస్కరించారు. యీ మానవతావాదులు రెండవ ప్రపంచ యుద్ధానంతర, స్టాలిన్ అనంతరదశలో వచ్చినవాళ్ళు. యిదే సమయంలో చారిత్రక భౌతికవాదం అంటే కచ్చితంగా యేమిటి, దాని స్థాయి యేమిటి అన్నది యివాళ చర్చనీయాంశంగా వుంది. అంచేత యిటో, అటో యెటైనాగానీ భావవాదం అన్న సమస్య మార్క్సిస్టు చింతనా ధోరణిలో ఆదిలో మాదిరిగానే కేంద్రస్థానంలో నిలిచేవుంది.

## గతితర్కం

బహుశా యిదే మార్క్సిస్టు చింతనలో అతి పెద్ద వివాదాస్పద అంశం. దీన్నుంచి రెండు ముఖ్యమైన ప్రశ్నలు పుట్టుకొచ్చాయి. మార్క్సిస్టు తాత్విక చర్చ వాటిమీదకు మళ్ళింది. అవేమిటీ అంటే హెగెల్‌కి మార్క్స్

రుణం యెలాంటిది, మార్క్సిజం యే అర్థంలో శాస్త్రం అవుతుంది అన్నవి. మార్క్సిస్టు సంప్రదాయంలో యీ భావన గురించి అతి సాధారణంగా నొక్కిచెప్పేవి. 1) ఒక పద్ధతి. అతి సామాన్యంగా శాస్త్రీయ పద్ధతి. దృష్టాంతంగా జ్ఞాన మీమాంస (epistemological గతితర్కం: 2) ఒక నియమాల లేదా సూత్రాల సమాహారం. అవి యావత్ వాస్తవ పరిస్థితిలోని యేదో ఒక విభాగాన్ని ప్రభావితం చేస్తూ వుంటాయి. సత్తాశాస్త్రం (ontological) గతితర్కం. 3) చరిత్రగతి చాటేది. సంవాదిత్వ గతితర్కం (relational). యీ మూడూ కూడా మార్క్సులో కనిపిస్తాయి. కాని వాటి రూప నిష్పత్తుల ఉదాహరణలు "పెట్టుబడి" అన్న గ్రంథంలో మార్క్సు అనుసరించిన క్రమపద్ధతి వివరణాత్మకతలో కనిపించే వ్యాఖ్యలు; ఏంగెల్స్ "యాంటీ డూరింగ్" వివరించిన ప్రకృతి తత్వశాస్త్రం. లూకాక్స్ మొదట్లో తన "చరిత్ర - వర్గ చైతన్యం" అన్న గ్రంథంలో "హెగెలియనిజాన్ని దాటి సాగడం". యీ గ్రంథాల్ని మార్క్సిస్టు సామాజికశాస్త్ర స్థాపన చేసే పత్రాలుగా, గతితార్కిక భౌతికవాదాన్ని స్థాపించే పత్రాలుగా, పాశ్చాత్య మార్క్సిజాన్ని ప్రకటించే పత్రాలుగా పరిగణించవచ్చు.

హెగెల్ తత్వశాస్త్రంలో గతితర్కానికి రెండు రూప భేదాలున్నాయి. 1) తార్కిక క్రమం 2) మరింత సంకుచితంగా యీ క్రమానికి చోదకం.

1) హెగెల్ భావవాద సూత్రంలో యదార్థం గురించిన అవగాహన (పరమ) ఆత్మ. యిది రెండు ప్రాచీన గతితర్కపాయల్ని ఏకం చేసుకుంటుంది. ఎలియాటిక్ "హేతువు" అనే గతితర్కం. (ఎలియా అనే గ్రీకు నగరానికి చెందిన దార్శనికుడు) అయోనియన్ (Ionian) గతితార్కిక భావం అయిన "క్రమం". యిందులో హేతువు క్రమం స్వయం ఉద్భూతంగా, స్వయం విశిష్టతతో, స్వయం ప్రత్యేకతతో గతితర్కం వుంటుందన్న భావన వుంది. మొదటిభావం జెనో విరోధాభాసలతో మొదలవుతుంది. అక్కడి నుంచి విభేదించే సోక్రటిక్, ప్లేటోనిక్, అరిస్టాటిలియన్ గతితర్కాల గుండా సాగుతుంది. అలా మధ్యయుగాల తర్కం నుంచి కాంటియన్ విమర్శదాకా వస్తుంది. రెండవది ప్రత్యేకమైన ద్వంద్వ స్వరూపంతో వుంటుంది: అధిరోహించే గతితర్కం. ఉన్నత యదార్థ అస్తిత్వం అనేది. (ఉదా. దైవరూపాలు) వెల్లడవుతుంది.

అవరోహణ గతితర్కంలో, అది దృగ్గోచర ప్రపంచంలో వెల్లడవడం వ్యక్తమవుతుంది. దీనికి నమూనాలు ప్రాచీన సంశయ వాదానికి చెందిన పదార్థపు అధిరోహణ గతితర్కం. అలాగే నయాప్లేటానిక్, క్రైస్తవ పరలోక విద్య (eschatology)లో దైవం స్వయం వ్యక్తమవడానికి సంబంధించిన స్వతస్సిద్ధ గతి తర్కం. యీ ధోరణి ప్లాటినస్, ఎరుజెనా (Eriugena) నాటి నుంచీ వున్నటువంటిది. యీ ఆరోహణ, అవరోహణ దశల కలయికవల్ల అసలైన ఏకత, దాదాపు ఐహికమైన ధోరణిలో ఫలితంగా వస్తుంది. లుప్తత లేదా విభజన వస్తాయి. తిరిగిరావడం లేదా పునరేకీకరణ వస్తాయి. లేదా మూల తత్వానికి వాస్తవీకరణకు దాదాపు తార్కికమైన ధోరణి వస్తుంది. యీ ఎలియాటిక్, అయోనియన్ పాయల సమ్మేళనం హెగెల్ పరతత్వంగా పరిణమించింది - యిదొక తార్కిక క్రమం లేదా గతి తర్కం. యిది తనకిగా వాస్తవికం అవుతుంది, తనకిగా పరాయీకరణ చెందుతూ అలా అవుతుంది. తన స్వయం ఏకతను పునః స్థాపించుకుంటుంది. యెలాగ అంటే యీ పరాయీకరణ అనేది తన యిచ్ఛాపూర్వక భావ ప్రకాశం లేదా స్వయంవ్యక్తం అని గుర్తించడం ద్వారానన్నమాట. యీ హెగెలియన్ భావన క్రోడీకృతమై, హెగెలియన్ పంథాలోనే పరిపూర్ణం అయింది.

**2)** యీ క్రమానికి చోదకం మరింత సీమిత భావనలో గతితర్కం. దీన్ని హెగెల్ "వైరుధ్యాల్ని వాటి ఏకతలో గ్రహించడం లేదా ధనపక్ష, రుణపక్షాల ఏకత" అన్నాడు. గతితార్కిక వ్యాఖ్యాత యీ క్రమాన్ని అభివర్గాలతో, భావాలతో చైతన్య రూపాలతో గ్రహించ గలిగేటట్టు చేసే పద్ధతి యిది. యీ గ్రహణ సాధనాలు (అంటే అభివర్గాలు వగైరా) ఒకదాన్నుంచి ఒకటి ఆవిర్భవిస్తాయి. దానివల్ల మరింత సంగ్రహించుకునే పూర్ణతలు యేర్పడతాయి. ఆ రకంగా అభివర్గాల, భావాల, రూపాల పూర్ణత్వం సిద్ధించే దాకా సాగుతుంది. హెగెల్‌కి సంబంధించి సత్యమే సంపూర్ణం. దోషం ఏకపక్షంలో వుంటుంది, అసంపూర్ణత్వంలో వుంటుంది, గ్రహణలో వుంటుంది. అది ఉత్పన్నం చేసిన వైరుధ్యాల నుంచి దాన్ని గుర్తించవచ్చు. వాటిని మరింత సుసంపన్నమైన, సంపద్వంతమైన, మరింత నిర్దిష్టమైన భావనా రూపాలలో యిమిడించడం ద్వారా మెరుగవుతుంది. యీ క్రమం

సాగడంలో ప్రఖ్యాత సూత్రం సబ్లేషన్ (sublation) అన్నది కనిపిస్తుంది. గతితర్కం విరిసేకొద్దీ యే పాక్షిక లోదృక్కునీ యెన్నడూ పోగొట్టుకోవడం జరగదు. నిజానికి హెగెలియన్ గతితర్కం రెండు ప్రాథమిక మార్గాల్లో ముందుకు సాగుతుంది: అంతర్గర్భితంగా వున్నదాన్ని బయటికి తీయడం, యిది బాహ్యంగా వెల్లడికాదు కదా. యేదో ఒక భావంలో లేదా యేదో లోపాన్ని సవరించడం ద్వారా, అందులోని లోపాన్ని, అసంపూర్తిని సవరించడం ద్వారా అలా చెయ్యడం జరుగుతుంది. "గతితార్కిక" చింతన, "చింతనాశీలమైన" (లేదా విశ్లేషణాత్మకమైన) భావనాత్మక రూపాలని వాటి క్రమరీతి అంతస్సంబంధాలతో గ్రహిస్తుంది కాని వాటిని నిశ్చితం చేసే విభేదాలతో కాదు. ప్రతి వస్తువులోని పరిణామాన్ని, అంతకు అంతగా పరిణతి చెందని దాన్నుంచి వచ్చినదానిగా గ్రహిస్తుంది. అసలు యిది ఆ పరిణత రూపానికి అవసరమైన సత్యమూ, సంపూర్ణతానూ. అంచేత ఆ రకంగా సర్వదా ఉద్రిక్తత, గుప్త వ్యతిరేకార్థం లేదా ఆసన్న సంభ్రమం ఆ పూర్వరూపానికీ, యిప్పుడు వచ్చిన రూపానికీ మధ్య వుంటాయి.

హెగెలియన్ గతితర్కం మీద మార్క్సు చింతనలో వచ్చిన అభివృద్ధిలో అతిముఖ్యమైన దశలు: 1) "క్రిటిక్ ఆఫ్ హెగెల్స్ ఫిలాసఫీ ఆఫ్ ద స్టేట్"లో వున్న "మార్మిక" తర్కం మీద వైదుష్యం తొణికిసలాడే విశ్లేషణ. "ఆర్థిక, తాత్విక రచన"ల కడపటి పత్రంలో తిరిగి అందుకోవడం జరిగింది. యిక్కడ శ్రమ గురించిన హెగెల్ భావవాద భావన కేంద్రస్థానం ఆక్రమిస్తుంది. 2) ఆ తరవాత వెంటనే వచ్చిన "ద హోలీఫేమిలీ", "ద జర్మన్ ఐడీయాలజీ", "ద పావర్టీ ఆఫ్ ఫిలాసఫీ" అన్న గ్రంథాల్లో ఒట్టి ఆలోచనకే పరిమితమైన తత్వశాస్త్రం మీద భీకరమైన వివాదాస్పద దాడి చెయ్యడంలో హెగెల్‌మీద విమర్శ అంతర్గతంగా వుంది. 3) "గ్రుండ్‌రిస్సె" సమయం నుంచీ హెగెలియన్ గతితర్కాన్ని నిర్దిష్ట సానుకూల పునర్మూల్యాంకనం చెయ్యడం. యీ పునర్ మూల్యాంకన విస్తృతి ఆసక్తిదాయకమైన వివాదంగా నిలిచిపోయింది. అయితే రెండు అంశాలు మాత్రం సందేహరహితంగా కనిపిస్తాయి: మార్క్సు తను చేసిన హెగెలియన్ గతితర్క విమర్శనను కొనసాగిస్తూనూ వచ్చాడు, హెగెలియన్ గతితర్కంతో సంబంధం వున్న గతితర్కంతో తనే

పనిచేస్తూనూ వున్నాడు. ఆ విధంగా ఆయన డ్యూరింగ్ ప్రసక్తి సందర్భంలో యిలా అన్నాడు: "నేను అభివృద్ధి చేసిన పద్ధతి హెగెలియన్ కాదు అని ఆయనకు బాగా తెలుసు. యేమంటే నేను భౌతికవాదిని, హెగెల్ భావవాది. హెగెల్ గతితర్కం సకల గతితర్కానికీ మౌలికం అయిన రూపం, కాని యెప్పుడూ అంటే దాన్నుంచి ఆ మార్మికరూపాన్ని తీసేసినప్పుడు. సరిగ్గా యిదే నా పద్ధతిని విశిష్టం చేస్తుంది." (కుగ్లెమాన్‌కి రాసిన జాబులో, 6 మార్చి 1868) పెట్టుబడి మొదటి వాల్యూం రెండవ కూర్పు "చివరిమాటలో" ఆయన యిలా రాశాడు: "గతితర్కం హెగెల్ చేతిలో మాయావాదానికి గురైంది. అయినప్పటికీ దాన్ని సమగ్రంగా, పూర్తి స్పృహతో సాధారణ రూపంలో వ్యక్తం చేసిన మొదటివ్యక్తి హెగెల్ మాత్రమే. ఆయన గతితర్కం తలకిందులుగా వుంది. మాయావాదపు పెంకులో ఉన్న హేతుబద్ధపు గుజ్జును గ్రహించాలంటే దాన్ని సక్రమంగా కాళ్ళపైన నిలబెట్టాలి." యిక్కడ రెండు ఉపమానాలున్నాయి తలకిందులు సరిచేసి సక్రమంగా నిలబెట్టడం, హేతుబద్ధపు గుజ్జు. యివే మతపర ఊహలకు దాదాపు విషయంగా వున్నాయి. "గుజ్జు" ఉపమానం చూస్తే హెగెలియన్ గతితర్కంలోని భాగాన్ని వెలికి తియ్యడం సాధ్యమేనని మార్క్స్ భావించినట్టు సూచన కనిపిస్తోంది – అదీ రెండు పక్షాలకి వ్యతిరేకంగా.

1) హెగెలియన్ పద్ధతి నుంచి సంపూర్ణంగా గతితార్కిక పద్ధతిని బయటికి తీయడం సాధ్యమని యువ హెగెలియన్లు, ఎంగెల్స్‌లు భావించడం 2) అసలు అలా బయటికి తీయడం అనేదే సాధ్యం కాదు అని బెర్న్‌స్టయిన్ నుంచి కొల్లెటి దాకా వున్న పోజిటివిస్ట్ దృక్పథం. వీళ్ళు యెందుకు సాధ్యం కాదు అంటారంటే హెగెలియన్ గతితర్కం కంఠదఘ్నంగా హెగెల్ భావవాదంతో రాజీపడిపోయింది కాబట్టి. దురదృష్టవశాత్తూ మార్క్స్ తన కోరికను నెరవేర్చు కోలేకపోయాడు. అదేమంటే, "సాధారణ పాఠకుడికి సులభ గ్రాహ్యంగా వుండేటట్టు రెండు మూడు అచ్చు పేజీలలో, హెగెల్ ఆవిష్కరించిన పద్ధతిలో యేది హేతుబద్ధమో యేది మార్మికం అయిందో" వివరించాలన్న కోరిక. (ఏంగెల్స్‌కి 1858 జనవరి 14న మార్క్స్ రాసిన ఉత్తరంలో)

హెగెల్‌కి మార్క్సు రుణం యెలాంటిదైనాగానీ హెగెల్ విమర్శ ఆయనలో గణనీయమైన స్థిరత్వంతో వుంది. 1843 నుంచి 1873 దాకా ఆయన హెగెల్ గురించి చేసిన విమర్శల్లో యిది కనిపిస్తుంది. అ) మామూలుగా మార్క్స దాడికి మూడు ముఖ్య గమ్యాలున్నాయి - హెగెల్ తలకిందులు, హెగెల్ సారూప్యత భావన, ఆయన తార్కిక మార్మికత. ఆ) తత్వతః మార్క్సు హెగెల్ వైఫల్యం మీద లగ్నం కావడం. ప్రకృతి స్వయం ప్రతిపత్తినీ, సామాజిక రూపాల చారిత్రకతనూ హెగెల్ నిలబెట్టివుంచకపోవడమే ఆ వైఫల్యం.

అ) 1. మార్క్సు భావనలో హెగెల్ దోషం కర్త, క్రియ కర్మాదికాలని మూడు విధాల తలకిందులు చెయ్యడం. ప్రతి సందర్భంలోనూ హెగెల్ స్థానాన్ని మార్క్స తలకిందులు అన్నాడు, తన స్థానాన్ని హెగెల్ స్థానాన్ని తలకిందులు చెయ్యడం అన్నాడు - తలకిందులుగా వున్నదాన్ని తలకిందులు చెయ్యడం. ఆ రకంగా హెగెల్‌లో వున్న పరమ భావవాద సత్తాశాస్త్రానికి, ఊహత్మక హేతుపూరిత జ్ఞాన మీమాంసకు, దృఢమైన భావవాద సామాజికశాస్త్రానికి ప్రతికూలంగా తన ప్రతిపాదనల్ని పెడతాడు. అవేమిటీ అంటే, ప్రత్యేక వస్తువుల ధర్మాలుగా సార్వత్రికాల గురించిన భావన, కుదింప శక్యంగాని అనుభవవాద, పౌర సమాజ జ్ఞానం (అ తరవాత ఉత్పత్తి విధానాలు అయినవి) రాజ్యానికి పునాది 'అన్న భావనలు. అయితే మార్క్స పూరికే హెగెల్ స్థానానికి వ్యతిరేకమైన దాన్ని ధ్రువపరుస్తున్నాడా లేక దాని సమస్యాత్మకతను మారుస్తున్నాడా అన్నది స్పష్టం కాలేదు. నిజానికి, ఆయన యీ రెండో పక్షాన్నే అనుసరిస్తూ వున్నాడు సామాన్యంగా: ఆయన విమర్శ హెగెల్ విపర్యయాలమీద అంతగానూ హెగెల్ పదబంధాల మీదా, సంబంధాల మీదా గురి పెట్టినటువంటిది. అపరిమేయ మనసు అనేది (పరాయీకరణ చెందిన) పరిమేయ వస్తువులు ప్రకృతి అనేవి భ్రమాన్వితంగా ముందుకు వచ్చినదనీ, అదే అతీత యదార్థం అని పరిగణించడం జరుగుతోందనీ మార్క్సు భావించాడు. హెగెల్ స్వతస్సిద్ధమైన ఆధ్యాత్మికమైన సృష్టిపరమోద్దేశం, అపరిమేయ, స్తబ్దీకృత, పరిమేయ మనసుకి సంబంధించిన ప్రతిపాదన. దీనిబదులు విశ్లేషణా పద్ధతిలో నిబద్ధతను తీసుకువచ్చాడు. దీనికి సంబంధించీ అంటే ప్రయోగాత్మకంగా నియంత్రణ పొందిన అన్వేషణకు

సంబంధించి. యీ విశ్లేషణా పద్ధతిద్వారా చారిత్రకంగా ఆవిర్భవిస్తూ వున్న, పరిణమిస్తూ వున్న మానవాళికీ, కుంచింపశక్యంగాని యదార్థమైన కాని సవరించ దగ్గ ప్రకృతికీ మధ్య, వాటిలో అంతర్గతంగానూ వున్న కార్యకారణ సంబంధాల్ని అన్వేషించడం. హెగెల్‌లో గుర్తించిన ఆ మూడు విపర్యయాలనీ మార్క్సు స్పష్టంగా వేరుచేసి చెప్పనూ లేదు. అయితే వాటి ప్రత్యేకతలు మార్క్సు చేసిన రెండవ, మూడవ విమర్శల్లో గర్భితంగా వున్నాయి. హెగెల్ అస్తిత్వాన్ని తెలుసుకోవడానికి (జ్ఞాన భ్రమ), శాస్త్రాన్ని తత్వశాస్త్రానికీ (ఊహాత్మక భ్రమ) కుదించడాన్ని నిర్దిష్టం చెయ్యడం ద్వారా మార్క్సు విమర్శలు సాగాయి.

ఆ) హెగెల్ సారూప్య సూత్రాన్ని గురించి (అస్తిత్వం ఆలోచనలు ఆలోచనల్లో సారూప్యంగా వుండడం) మార్క్సు చేసిన విమర్శ జమిలిగా వుంది. అందరికీ విశదమయేట్టు ఆయన చేసిన విమర్శ ఫోయెర్ బాఖ్ పరివర్తనాత్మక పద్ధతిని అనుసరించి వుంటుంది. యీ విమర్శలో ఆయన హెగెల్‌కి ఆలోచన శుద్ధ సత్త్వంగా కనిపించిన దాని **ఫలితంగా** అనుభవపూర్వక ప్రపంచం యెలా దర్శనమిస్తుందో చూపించాడు. కాని తన గూఢమైన విమర్శలో మార్క్సు అనుభవపూర్వక ప్రపంచం నిజానికి దాని రహస్య నియమం అని వాదిస్తాడు. ఆ రకంగా హెగెల్ తన కార్యకలాపాన్ని లేదా సామాన్యంగా ఆలోచనా క్రమాన్ని ప్రదర్శిస్తాడో మార్క్సు గమనించాడు. హెగెల్ దాన్ని ఒక స్వతంత్రం అంశం (భావం)గా చేస్తాడు. అనుభవంలోకి వచ్చిన ప్రపంచపు సృష్టి సహాయకం. అప్పుడాయన ఊహాత్మక తత్వవేత్త ఆలోచన నిజానికి యెలా వుంటుందో వివరించాడు. అది అనుభవంలోకి వచ్చిన సమాచారాన్ని అవిమర్శకంగా అందుకుంటుంది. యదార్థంలో అస్తిత్వంలో వున్న స్థితి నుంచి దాన్ని సంగ్రహించు కుంటుంది. దాన్ని ఓ రకంగా రూప సమన్వితం చెయ్యడం, బాహ్యీకరించడం జరుగుతుంది. యీ కింది రేఖా చిత్రవివరణ మార్క్సు అభ్యంతరంలోని తర్కాన్ని విశదంచేస్తుంది.

| | | |
|---|---|---|
| | | భావనాత్మక యధార్థ<br>శుద్ధసత్త్వం |
| అనుభవాధార<br>ప్రపంచం | పరిమేయ<br>బుద్ధి | అపరిమేయ<br>బుద్ధి |

| | | |
|---|---|---|
| అనుభవపూర్వక | | భావనాత్మకంగా |
| యదార్థ ప్రతిక్రియ | బాహ్యరూపంగా | యదార్థం |
| | వెల్లడవడం | రూపాంతరం చెందడం |

అవిమర్శక పోజిటివిజమ్ (ఫోయెర్ బాఖ్ క్షణం) — అవిమర్శక భావవాదం

హెగెల్ సారూప్య సిద్ధాంతం గురించి మార్క్స్ చేసిన విమర్శ. మార్క్స్ విశ్లేషణలో 1) హెగెలియన్ పద్ధతిలో సంరక్షణాత్మకత, సమర్థనాత్మకత సహజంగానే వున్నాయి. వామపక్ష హెగెలియన్లు భావించినట్టు యేదో వ్యక్తిగత బలహీనతవల్ల, రాజీ ధోరణివల్ల కాదు. 2) హెగెల్ తార్కిక సిద్ధాంతం ఆయన వాస్తవ ఆచరణతో పొసగదు. ఆ రకంగా ఆయన గతితర్కం గతితర్కేతర, అనాలోచిత, దగ్గర దగ్గరగా ముతక భావనలతో వున్నట్టు తయారవుతుంది.

ఇ) హెగెలియన్ "తార్కిక మార్మికత"ను, స్వయంభువుగా అవతరించే భావనల్ని, దానివల్ల వచ్చే భావజాల మాంత్రిక టిక్కులను మార్క్స్ విమర్శించాడు. యీ విమర్శ తత్వశాస్త్రపు (సామాన్యంగా భావాల) స్వయం ప్రతిపత్తి మీదకు లేదా కడపటి స్వయం సమృద్ధిమీదకు విమర్శగా తేలుతుంది. అయితే యిక్కడ కూడా ఒక విషయం స్పష్టం కాలేదు. అదేమిటీ అంటే మార్క్స్ 1) ముక్కస్యముక్కార్థంగా విలోమాన్ని, అంటే, శాస్త్రం తత్వశాస్త్రాన్ని లేదా దాని పోజిటివిస్టిక్ ఆక్రమణని సంగ్రహించడాన్ని సమర్థిస్తున్నాడా? "జర్మన్ భావజాలం" దశలో సాగిన వాగ్వివాదాలు యిలాంటి సూచనను అందిస్తున్నాయి. లేదా 2) తత్వశాస్త్రపు పరివర్తన చెందిన ఆచరణను, అంటే, విభిన్న అంశాలకు లోబడి (స్వతంత్ర ప్రతిపత్తికి భిన్నంగా నన్నమాట), శాస్త్రం మీదా యితర సామాజిక కార్యకలాపాలమీదా ఆధారపడి వుంటుందా? అయితే కొంతలో కొంత స్వయం ప్రతిపత్తి దానికి వుండచ్చు. యీ విషయం స్వయంగా ఆయన ఆచరణలో (ఏంగెల్స్ ఆచరణలో కూడా) సూచితమైనట్టు.

2) మార్క్స్ "ఆర్థిక తాత్విక పత్రాల"లో హెగెల్‌మీద చేసిన సమాలోచనలో భావనాత్మకమైన ఖాళీలు వున్నాయి. i) ప్రకృతి వస్తుగతంగా వుండడం, ఆలోచనకు యితరమైనది సామాన్యంగా మౌలికమైనట్టు భావించడం. అంటే తనకిగా అది యదార్థం అయినట్టు.

అది కార్యకారణ సంబంధం రీత్యా యే రకమైన బుద్ధిమీదా ఆధారపడదంగాని మూలసంకల్పానుసారంగా సృష్టి సాగుతుందన్న దాని అవసరంగాని లేకపోవడం. ii) వాస్తవీకరించడానికి పరాయీకరణకీ మధ్య అంతరం - శుద్ధ సత్వం స్వయం పరాయీకరణగా ప్రస్తుత, చారిత్రక నిశ్చిత, మానవ వాస్తవీకరణ పరాయీకృత రూపాలుగా హేతుబద్ధంగా మారురూపం చెయ్యడంవల్ల హెగెల్ భావన పరిధిలోనే ఒక అవకాశాన్ని ముందే తొలగించేస్తున్నాడు. అదేమిటీ అంటే మానవ వాస్తవీకరణకు సంబంధించిన నిజమైన మానవీయ, పరాయీకరణ చెందని పద్ధతి. హెగెల్‌కి సంబంధించి "ఒకే ఒక శ్రమ... అపరిమేయ బుద్ధిశ్రమ" (అర్థిక తాత్విక రచనలు. మూడవ రచన చివర). మరింత సామాన్యంగా దీనికి వ్యతిరిక్తంగా మార్క్సుకి శ్రమ అంటే i) పాదార్థిక పునాది వున్నది... మానవుని అవసరం లేకుండానే అది వుంటుంది. ii) అసలైన పరివర్తన యిందులో వుంటుంది. పూడ్చలేని నష్టం, పరిమితత్వం యీ పరివర్తనలో కలుగుతాయి. నికార్సైన నవ్యత, ఆవిర్భావం వచ్చే అవకాశాలు వుంటాయి. అంచేత యే మార్క్సియన్ గతితర్కమేనా వస్తుగతంగా నియమితమై నిరపేక్షంగా పరిమేయం, భావి నిరీక్షణగా తెరుచుకుని వుండడం (అసంపూర్తి)

హెగెల్ సారూప్య తత్వశాస్త్రం గురించి మార్క్సిస్టు సమాలోచన లేవనెత్తే అంశం యేమిటంటే మార్క్సు (అలాగే మార్క్సిజం) గతితర్కం ఒక ఏకతీరు దృగ్వియాన్ని ప్రత్యేకించడం కాదు, విభిన్న చిత్రాల్ని, అంశాల్ని తీసుకురావడం. ఆ రకంగా అది తత్వశాస్త్రంలోని నమూనాలనిగాని, క్రమాల్నిగాని; శాస్త్రాన్నిగాని, లోకాన్నిగాని; అస్తిత్వం ఆలోచనలని గాని, లేదా వాటి సంబంధాన్నిగాని (సత్తాశాస్త్రం, జ్ఞానమీమాంస, హేతుబద్ధ గతితర్కం); ప్రకృతిగాని సమాజంగాని; కాలం లోపల, బయటగాని (చారిత్రక పోటీగా నిర్మాణాత్మక); సార్వజనీనంగాని, ప్రత్యేకంగాని, చారిత్రకాతీత లేదా తాత్కాలికంగాని తీసుకువస్తుంది. యీ అభివర్గాల లోపల్నే మరిన్ని విభజనలు ప్రముఖంగా వుంటాయి. ఆ రకంగా యే జ్ఞాన మీమాంస గతితర్కమైనా భావనాంతరమైంది కావచ్చు (విమర్శనాత్మక లేదా క్రమరీతి) నూతన పరిశోధనకు ఉపకరించేది కావచ్చు లేదా అస్తిత్వాన్ని రుజువుచేసేది కావచ్చు (వర్ణనాత్మక లేదా

వివరణాత్మక) సంబంధిత గతితర్కం మౌలికంగా సత్తాశాస్త్ర క్రమంగా అన్న భావన వుండచ్చు. (ఉదా. ల్యూకాక్స్) లేదా జ్ఞానమీమాంస సమాలోచన కావచ్చు (ఉదా. మార్క్యూస్) అలాంటి గతితర్క రీతులు i) ఒక ఉమ్మడి మూలంతో సంబంధించి వుండచ్చు ii) సంబంధం లేకుండా మార్క్సిజం లోపలనే క్రమరీతి బంధనాలతో వుండచ్చు iii) వాటి సమస్థిసారం, ఆయువుపట్టు లేదా బీజం కలిగివుండచ్చు, యింకా తక్కువగా iv) హెగెల్‌కేసి మళ్ళి (యే మార్పు లేకుండా) అధ్యయనం చేసేట్టూ వుండచ్చు. అయినా కూడా మార్క్స నిశ్చయంగా హెగెలియన్ గతితర్కానికి రుణపడివుండచ్చు, మార్క్స రచనల్లో అది సంపూర్తిగా పరివర్తన చెందినప్పటికీ (అలాంటప్పుడు మూలభూతమైన అంశం అనేదిగాని విలోమ ఉపమానంగాని అనువర్తించవు) లేదా అనేక పద్ధతుల్లో అభివృద్ధి చేసి వుండనూ వచ్చు.

మార్క్సియన్ గతితర్కంలో అత్యంత సాధారణంగావున్న నిశ్చిత సిద్ధాంతాలు i) ప్రపంచం గురించిన భావనగా (ఉ. ఎంగెల్స్, గతితార్కిక భౌతికవాదం, మావొజెడాంగ్ ii) హేతువాద సిద్ధాంతంగా (ఉదా. డెల్వొఒల్పె, అడార్నో) iii) వాటిమధ్య సంబంధాలమీద ఆధారపడి ముఖ్యంగా (లేదా అస్తిత్వం, ఆలోచన; వస్తువు, లక్ష్యం; సిద్ధాంతం ఆచరణ వగైరా) (ఉదా. లూకాక్స్, మార్క్యూస్). మార్క్స అవగాహనలోనే మౌలికంగా నొక్కి చెప్పింది జ్ఞానమీమాంసభావన. మార్క్స తరచుగా "గతితర్కం" అన్నదాన్ని శాస్త్రీయ పద్ధతికి సమంగా వాడతాడు. పెట్టుబడి మొదటి సంపుటం మలిమాటలో ఆయన సెయింట్ పీటర్స్‌బర్గ్ సమీక్ష కూడ రాసినదాన్ని ఉల్లేఖిస్తాడు. తన పద్ధతిని ఆ సమీక్షకుడు విశిష్టంగా వున్న పోజిటివిస్టిక్ వర్ణనను తన పద్ధతి గురించి చేశాడు.

"నేను నిజానికి వాడిన పద్ధతిని సమీక్షకుడు యింత కచ్చితంగా వివరిస్తూ వుంటే అతను గతితార్కిక పద్ధతినిగాక మరిదేన్ని వివరిస్తున్నట్లు అని మార్క్స వ్యాఖ్యానించాడు. అయితే ఒకటి మాత్రం నిజం. మార్క్స పద్ధతి భౌతికానుసరణమూ, అనుభవవాద పూర్వకమూ అయినా పోజిటివిస్టిక్ కాదు కాని వాస్తవికం (వాస్తవవాద సంబంధి). ఆయన జ్ఞానమీమాంస గతితర్కం ఆయన్ని ప్రత్యేక సత్తావాదానికి, సాపేక్ష సంబంధిత గతితర్కానికీ కూడా నిబద్ధుణ్ణి చేస్తుంది. 1865 జనవరి 24న

జె.బి. ష్వైజర్‌కి ఆయన ఒక లేఖ రాశాడు. "శాస్త్రీయ గతితర్క రహస్యం" అనేది. **"పాదార్థిక ఉత్పత్తి అభివృద్ధి ఒక ఫలానా దశతో తూగేటట్టు ఉత్పత్తి చారిత్రక సంబంధాల సైద్ధాంతిక వ్యక్తీకరణగా ఆర్థిక అభివర్గాల్ని"** అవగాహన చేసుకోవడం మీదనే ఆధారపడి వుంటుంది" అని అందులో మార్క్సు అంటాడు. మార్క్సు గతితర్కం శాస్త్రీయమైంది. ఎందుకనీ అంటే అది ఆలోచనల వైరుధ్యాలనీ జీవిత సామాజిక ఆర్థిక సంక్షోభాలకీ ఆ ఫలానా వైరుధ్యపూర్తి మౌలిక సంబంధాల నేపథ్యంలో వివరిస్తుంది. అసలు ఆ సంబంధాల్ని కల్పించేది అవే. (సత్తాశాస్త్ర గతితర్కం). మార్క్సు గతితర్కం చారిత్రకమైంది. యేమంటే అది వివరించే పరిస్థితులకీ, ఆ సంబంధాలలో మార్పులనీ (సాపేక్షంగా) ప్రాతినిధ్యం వహిస్తూ, అందులోనే పాదుకుని వుంది (సంబంధిత గతితర్కం) .

మార్క్సు సూత్రీకరణలో అనుభవవాద నియంత్రిత శోధన వుంటుంది. వివరణలో దాదాపు అనుమితాంశ పద్ధతి వుంటుంది. వీటి రెండింటికీ మధ్య భేదంగా మనం ఆయన **క్రమరీతి** గతితర్కంలో నుంచి **విమర్శనాత్మక** పద్ధతిని విభేదించి గమనించగలం. మొదటిది చరిత్రలో క్రియకు జోక్యం చేసుకోవడంగా వుంటుంది. యిది మూడు రకాల సమాలోచనగా రూపం తీసుకుంటుంది - ఆర్థిక సిద్ధాంతాలు, కర్త భావనలు, వాటిలో గర్భితంగా వాటిని కలిగించే నిర్మాణాలు, మౌలిక సంబంధాలు వుంటాయి. యిది (చారిత్రీకరించిన) కాంటియన్ క్షణం (దీన్ని మొదట ప్రస్ఫుటం చేసినవాడు అడ్లర్) యిమిడి వుంటుంది. యిందులో అనేక అభివర్గాలు, సిద్ధాంతాలు, సిద్ధాంతాలు లాంటి పరిశీలనాంశాల చెల్లుబాటు చారిత్రక పరిస్థితులు, ఆచరణలో అనురూపత చాలా సూక్ష్మంగా యేర్పాటై వుంటాయి. మార్క్సు విమర్శనాత్మక గతితర్కాన్ని మహా అయితే అనుభవవాద పూర్వకంగా బహిర్గంగమైనదిగా వున్నట్టూ, భౌతికంగా నియమితమైనట్టూ, చారిత్రకంగా సీమితమైనట్టూ వుండే గతితార్కిక ప్రత్యక్ష ప్రమాణ విషయ జ్ఞానంగా పరిగణించవచ్చు.

మార్క్సు క్రమపద్ధతి తీరు గతితర్కం పెట్టుబడి మొదటి సంపుటం మొదటి అధ్యాయంలో మొదలవుతుంది, 'సరకు' గతితర్కంతో. "అదనపు విలువ సిద్ధాంతాలు" అన్నచోట్లో పరిపూర్ణస్థాయిని చేరుతుంది.

ఆర్థికశాస్త్రం గురించిన సవిమర్శనాత్మక చరిత్రతో అలా చేరుతుంది. మార్క్స్ ప్రకారం చివరికి సకల పెట్టుబడిదారీ వైరుధ్యాలకీ జన్మస్థానం సరకు ఉపయోగ విలువకీ, విలువకీ మధ్య వున్న నిర్మాణపర మౌలిక వైరుధ్యాలే. అందులో యిమిడివున్న శ్రమ సంబంధమైన నిర్దిష్ట ఉపయోగ, నైరూప్య సామాజిక పార్శ్వాలే. యీ వైరుధ్యాలకి తోడు యితర నిర్మాణపర చారిత్రక వైరుధ్యాలూ వున్నాయి, (ఉత్పత్తి శక్తులు, సంబంధాలు; ఉత్పత్తి, విలువ స్థిరీకరించే క్రమం, దినసరి కూలి పెట్టుబడి వగైరా). అవి i) నిజంగా కలిసివున్న ప్రాతికూల్యాలు, అంటే యిందులో మనుగడలో వైరుధ్య ధ్రువాలు ఒకటి వుంటే మరొకటి వుండాలన్నది గర్భితం ii) యివి అంతర్గతంగా యేదో మార్మికంగా కలిసిన రూపంతో వుండి బయటకు అది వెల్లడవుతుంది. అలాంటి **గతితార్కిక వైరుధ్యాలు** వైరుధ్యేతరమైన సూత్రాన్ని ఉల్లంఘించనూ ఉల్లంఘించవు - యేమంటే వాటిని స్థిరంగా యెత్తి చూపించవచ్చు. గురుత్వాకర్షణ నియమాన్నీ ఉల్లంఘించవు. నిజంగా విలోమంగా అసలు వస్తువును (తప్పు) - ప్రతిబింబిస్తాయి. ఆ వస్తువు ఉద్భూతం చేసిన యీ ప్రతిఫలనం పిసరు సందేహానికి తావులేకుండా ప్రయోగేతర, స్థిరీకృత సత్తాశాస్త్రంలో యిముడుతుంది. మార్క్స్ నిబద్ధమై వున్నదానికి. యీ మౌలిక నిర్మాణాత్మక వైరుధ్యాలనేవే చారిత్రక వారసత్వంగా వచ్చినవని మార్క్స్ భావన. ఆ వారసత్వం యేమిటీ అంటే సరకుని నేరుగా ఉత్పత్తి చేసేవాళ్ళు i) ఉత్పత్తి సాధనాలకీ, పదార్థాలకీ చెందకుండా విడిపోయి వుండడం ii) ఒకళ్ళ కొకళ్ళు విడిపోయి వుండడం iii) సామాజిక సంబంధాల వలలో వుండడం. దీంట్లో నుంచే ప్రకృతితో (వాళ్ళ ప్రతిచర్య) కార్యకలాపం జరుగుతాయి. యిక్కడ చరిత్ర గురించిన షిల్లెయన్ (Schillean) పథకం సవరించిన తీరులో సూచనప్రాయంగా కంటే అధికంగానే వుందన్న అంశం కొట్టిపారెయ్యలేనిది. అదేమిటీ అంటే చరిత్ర మూలంలో అవిభాజ్యమై ఏకతతో వున్న గతితర్కం, తునకలైన గతితర్కం, తిరుగుపాదు కొల్పిన ఏకత. అయితే విభాజిత ఏకత. ఆ రకంగా మార్క్స్ అంటాడు: "సజీవ, క్రియాశీల మానవులు ప్రాకృతిక నిర్జీవ స్థితిగతులలో **ప్రకృతితో** జీవపరిణామ వినియమంతో వుండే **ఏకత** కాదు, ఆ రకంగా ప్రకృతిని స్వాయత్తం చేసుకోవడం కాదు. అలాంటిది

వివరణ నపేక్షిస్తుంది. లేదా అది ఒక చారిత్రక క్రమ ఫలితం. అలాంటిది కాదు. ఓ రకంగా మానవ అస్తిత్వంలోని నిర్జీవ పరిస్థితుల నుంచి వాటి వేర్పాటు, క్రియాశీల అస్తిత్వం నుంచి వేర్పాటు. యెలాంటి వేర్పాటూ అంటే కూలి, పెట్టుబడి సంబంధంలో మాత్రమే సంపూర్తిగా వున్నటువంటి వేర్పాటు. '(గ్రుండ్‌రిస్సె "పెట్టుబడి" అధ్యాయం. నోట్‌బుక్ v) యిది ప్రయోగాత్మకంగా స్థాపితమైనట్టు ఆయన పరిగణించి వుండచ్చు. యేమైనప్పటికీ శాస్త్రం నుంచి అలాంటి భావనను ఖండించడం అనుచితంగా పరిమితం చెయ్యడం అవుతుంది. మాటకి, అది ఆధిభౌతిక నూతన పరిశోధనార్హంగావచ్చు లేదా కరడుగట్టిన వర్ధమాన పరిశోధనా కార్యక్రమంలో పనికిరావచ్చు, యీ బాపతు కార్యక్రమాలకు ప్రయోగవాద అంతరార్థాలు వుండచ్చు. వాటికి ప్రత్యక్షంగా ప్రయోగం లేకపోవచ్చు గాక, అది వేరే సంగతి.

అయితే మార్క్స్ "గతితార్కిక నిర్వచనాలు, సూత్రీకరణలు" అని పిలిచే వాటిలోకంటే గతితార్కిక వివరణలు విశిష్టం. వీటిలో ప్రతికూలశక్తుల్ని లేదా ధోరణుల్ని సాధారణ అస్తిత్వ పరిభాషలో వివరించడం జరిగింది; "సమాలోచనల్లో అసంపూర్తి సిద్ధాంతాల్ని దృగ్విషయాల్ని వగైరాలని ఆయా చారిత్రక పరిస్థితుల నేపథ్యంలో వివరించడం జరిగింది. అర్థశాస్త్రం గురించి మార్క్స్ చేసిన సమాలోచన ఔఫ్‌హెబంగ్ (Aufhebung) రూపం యెందుకు తీసుకుంటుంది. (అంటే సబ్లేషన్ (Sublation). ఒక కొత్త సిద్ధాంతం వచ్చిందనుకోండి. అది అంతకుముందు వున్న సిద్ధాంతాల్ని తోసి రాజనాలని వస్తుంది. ఆ సిద్ధాంతాలు విజయవంతంగా దృగ్విషయాన్ని వివరించే వుంటాయి. దాంట్లో యెక్కువ భాగాన్ని నూతన సిద్ధాంతం కాపాడ చూస్తుంది. కాని అలా దృగ్విషయాన్ని సైద్ధాంతికంగా పరిరక్షించడంలో మార్క్స్ మౌలికంగా యీ వర్ణనల్ని మార్పుచేశాడు. ఆ దృగ్విషయాన్ని నూతన సవిమర్శక - వివరణాత్మక వాతావరణంలో పెట్టేందుకుగాను ఆయన వాటి అసలైన పరివర్తన క్రమానికే దోహదపడ్డాడు. అయితే వాస్తవం గురించి హెగెల్‌కి వున్న భావనకు, తన విమర్శనాత్మక క్రమపద్ధతి గతితర్కంలో, మార్క్స్ రుణపడివున్నాడా? హెగెల్ సత్తాశాస్త్రానికి (Ontology) వున్న మూడు కీలకాంశాలూ 1) వాస్తవీకరించిన భావవాదం 2) ఆధ్యాత్మిక అద్వైతం

(monism) 3) స్వతస్సిద్ధమైన టెలెయాలజీ (teleology) అంటే సృష్టిపరమోద్దేశాన్ని, సంకల్పాన్ని అనుసరించి ప్రాణుల సృష్టి వికాసాలు జరుగుతాయన్న సిద్ధాంతం). (1) దాన్ని వ్యతిరేకిస్తూ మార్క్స్ హెగెల్ ప్రతిపాదించిన అపరిమేయాన్ని, నక్షత్ర రాశి సాదృశ్యరూపాన్ని కూడా యిక్కడ పదార్థాన్ని, అస్తిత్వాన్నీ జీవికీ, ఆలోచనకీ (పరాయీకరణ చెందినట్టు) కుదించడం భావన వుంది - తిరస్కరిస్తాడు. యిక (2) సంబంధించి. తారతమ్యం చూపడం, సంక్లిష్టత మార్క్స్‌కి ముఖ్యం అని అల్తూస్సర్ సరిగానే అన్నాడు. మార్క్స్ సమాహారాలు ప్రయోగ పరీక్షకు అర్థమవుతాయి, ఊహకు కాదు అని డెల్లావోల్పె సరిగానే నొక్కిచెప్పాడు. యిక (3) మార్క్స్ ఊనిక కార్యకారణ ఆవశ్యకతమీద భావనాత్మకం మీద కాదు. సృష్టిసంకల్పసూత్రం మానవ కార్యాచరణకి (Praxis) పరిమితం అయింది, అది వెల్లడికావడం మరో "తార్కికంగా వివరించడం జరిగింది." (1861 జనవరి 16న లాసాలేకి మార్క్స్ రాసిన ఉత్తరం). అన్నిటికంటే ముఖ్యం అయింది, "చరిత్ర శాస్త్రాన్ని" బీజావాపనం చేస్తున్న మార్క్స్‌కి, సత్తాశాస్త్ర సోపాన శ్రేణి స్థిరీకరణ, తయారవడం (becoming) అనేవి కుదించ నసాధ్యం అయినవి. హెగెల్‌లో అంతస్సారం, అస్తిత్వం అనేవాటి తార్కిక రంగాలుగా వుంటాయి. అంచేత పైన చెప్పుకున్నవి వాస్తవంలో, నిరపేక్షంలో సమ్మిళితం అయిపోతాయి (అంచేత "భావన" స్వయం వ్యక్తి పరిధిలోకి). తాత్వికపరంగా అన్ని ప్రముఖ పార్శ్వాల్లోనూ మార్క్స్ సత్తాశాస్త్రం హెగెల్ దానితో విభేదిస్తుంది, అణుశక్తి తత్వపు అనుభవవాదంతో మాదిరిగానే. యిదే ఎంగెల్స్ తరవాతి తాత్విక రచనలలో గురిగా వుంది. మార్క్స్ దీన్నే యువకుడుగా వున్నప్పుడు చేసిన సమాలోచనలో హెగెల్ భావవాదంతో గర్భితంగా వుందని చూపించాడు.

గతితర్కానికి సంబంధించి అత్యంత సామాన్యంగా అవలంబించే వైఖరులు మూడు వున్నాయి. యిది అర్థం పర్థం లేనిది (ఉ. బెర్న్‌స్టయిన్) అనేది ఒకటి. దీన్ని సార్వజనీనంగా అనువర్తింపచెయ్యొచ్చు అనేది మరోటి. దీన్ని భావనాత్మక, సామాజిక అనువర్తన చెయ్యొచ్చుగాని ప్రాకృతిక పరిధికికాదు అన్నది యింకొకటి (ఉ. లూకాక్స్). ఎంగెల్స్ తన ఆమోదముద్రను రెండవదానిమీద వేశాదు. ఆయన ప్రకారం సార్వజనీన

అనువర్తన మీద గతితర్కం "ప్రకృతి చలన, అభివృద్ధుల సామాన్య నియమాల శాస్త్రం, మానవ సమాజం, ఆలోచనల చలన అభివృద్ధుల సామాన్య నియమాల శాస్త్రం." (యాంటీ - డూరింగ్.) యీ నియమాల్ని ప్రధానంగా మూడుగా సూక్ష్మీకరించవచ్చు. (ప్రకృతిలో గతితర్కం) అవి పరిమాణాత్మకమైంది గుణాత్మకంగా పరివర్తన చెందడం, అలాగే గుణాత్మకం నుంచి పరిమాణాత్మకానికీనీ. 2) వైరుధ్యాలు ఒకదానితో ఒకటి కలిసి వుండడం. 3) నాస్తీకరణకు నాస్తీకరణ.

ఏంగెల్స్ వాదంలో సందేహాస్పద అంశాలు వున్నాయి. యీ నియమాలు కారణంబట్టి కార్యాన్ని వూహించే సత్యాలా లేక అతీత అనుభవవాద సామాన్యీకరణలా; లేదా శాస్త్రీయ ఆచరణకి తప్పనిసరి అయినదా లేక సౌకర్యార్థం వుండే వివరణాత్మక సాధనాలా. ఎంగెల్స్ ఉదాహరణలు యేక పక్షమైనవని పేరు పొందాయి. దీనికితోడు మార్క్సిజానికి - మార్క్సిజాన్ని సామాజికశాస్త్రంగా భావించడం జరుగుతోంది - ఆయన గతితర్కపు ఔచిత్యం కూడా ప్రశ్నార్థకమే. ముఖ్యంగా యేమంటే ఎంగెల్స్ కుదించివేసే భౌతికవాదానికి ప్రతికూలం. అందుబాటులోవున్న ఆధారాల ప్రకారం మార్క్స్ ఎంగెల్స్ జోక్యంలోని సాధారణ ప్రతిపాదనలని అంగీకరించినట్లే తోస్తుంది. అయితే మార్క్స్ తన అర్థశాస్త్ర సమాలోచనలో ప్రకృతిలోని గతితర్కం గురించి అభ్యూహ చెయ్యలేదు, యే గతితర్కాన్ని ఆవశ్యకం చెయ్యనూలేదు. ఆయన నిగమన తర్కంలో కార్యం నుండి కారణం వూహించే తర్కం గర్భితమై వుంది. యదార్థ స్థితిలో గతితార్కిక లేదా యితర రకాల క్రమాల గురించిన వాదనల వస్తు ప్రత్యేక స్వభావం వుంది. మార్క్సియన్, ఎంగెల్సియన్, హెగెలియన్ స్థానాలమధ్య సంబంధాన్ని యిలా చెప్పవచ్చు:



అసలు ప్రకృతిలో గతితర్కం అన్న ఊహే లూకాక్స్ నుంచి సార్త్ర్ దాకా చాలా మంది విమర్శకులకు అభివర్గపరంగా పొరపాటు అనిపించింది. యేమంటే మానవత్వారోపణ పూర్వకంగా (అంచేత భావవాద పూర్వకంగా) ప్రకృతిలోకి అభివర్గాల్ని వెనక్కి తొయ్యడం యిందులో యిమిడివుంది. అంటే వైరుధ్యం, నాస్తీకరణలాంటి అభివర్గాల్ని. వీటికి సంబంధించి మానవ పరిధిలోనే అర్థం వుంది. సామాజిక - చారిత్రక ప్రపంచంలో భాగంగా ప్రకృతి శాస్త్రం గతితార్కికం కావచ్చున్నమాటను యీ విమర్శకులు కాదనరు. అయితే వివాదంలో వున్న అంశం ప్రకృతిలో స్వతస్సిద్ధంగా గతితర్కంగా వుందా అని. సరే, ప్రాకృతిక, సామాజిక రంగాలమధ్య భేదాలు వుంటాయన్న విషయం స్పష్టమే. కాని వాటి ప్రత్యేక విభేదాలు వాటి వర్గ సాధారణ సామ్యాలకంటే కొంచెం అటూ యిటూగా ముఖ్యమా? పిండితార్థంలో ప్రకృతిలో గతితర్కం అన్న సమస్య ప్రాకృతికవాద సాధారణ సమస్య రూపాంతరంగా తేలుతుంది. దీని పరిష్కార మార్గం ఆధారపడడం దీనిమీద వుంటుంది: గతితర్కాన్ని తగినంత విశాలంగా భావించడం, సమాజాన్ని తగినంత ప్రకృతిపరంగా భావించడం. అప్పుడు ప్రకృతికి దాన్ని విస్తరింపచెయ్యడం సాధ్యపడుతుంది. ఆ సందర్భంలో కూడా యెవళ్ళూ ఏకపక్ష జవాబు కోసం చూడ్డానికి లేదు - ప్రకృతిలో గతితార్కిక ధ్రువాలు వుండచ్చు, వైరుధ్యాలతో కలిసి వుండచ్చు. కాని గతితార్కిక బుద్ధి గ్రాహ్యతగాని హేతువుగాని వుండవు. ఎంగెల్స్ సమర్థకులు కొందరు (ఉ. రూబెన్) యిలా వాదించారు. 1) మనిషి ప్రకృతిని జ్ఞాన మీమాంసాత్మకంగా ప్రశ్నించడం 2) ప్రకృతి నుంచి మానవుని చారిత్రక ఆవిర్భావం - షెల్లియన్ "తారతమ్యలేమి అంశాలు"లో (లేదా గతితార్కిక సారూప్యత) ముందేవుంది. "అతీత అభివర్గం బంధనాల అవబోధ నిలబెట్టుకుందుకుగాను. అయితే జ్ఞానపర సారూప్యత లేదా సమంకావడం (కొలతలోగాని ప్రయోగంలోగాని) చారిత్రక ఆవిర్భావం (పరిణామంలో) రెండూ కూడా సంబంధిత ప్రకృతి ధ్రువాల ఆచరణ రీత్యా స్వతంత్రతను పూర్వభావిగా వుంటాయి. మానవాళికీ ప్రకృతికీ మధ్య యే రకమైన గతితార్కిక సంబంధమేనా హెగెల్ పద్ధతి కాని పార్శ్వాన్ని తీసుకుంటుంది. అది అననురూప

అంతర్గత సంబంధం (సామాజిక రూపాలకి ప్రాకృతిక రూపాలు పూర్వభావిగా వుండడం యిటుదటు కాదు). అంచేత యే జ్ఞానపరమైన లేదా సత్తాశాస్త్రపరమైన సాదృశ్యమేనా అధిగమించే భౌతిక సాదృశ్యేతరమైన దానిలోనే సంభవిస్తుంది.

క్లుప్తంగా చెప్పుకోవాలంటే ఎంగెల్స్ జోక్యంలోని విరోధాభాస ఫలితం రెండవ ఇంటర్నేషనల్ నాటి మార్క్సిజం పరిణామంలో ఒక ధోరణి. అది అతి ప్రాకృతికవాదం వేపు, అద్వైతం (monism) వేపు వుంది. చాలా విధాలుగా హెల్మ్‌హోల్, దూరింగ్ తదితరుల పోజిటివిజంతో పోల్చదగ్గది. వీటినే ఎంగెల్స్ స్థిరంగా ప్రతిఘటిస్తూ వున్నది. అయితే నిడివిమీద హెగెల్ గతితర్కాన్ని ఎంగెల్స్ సంగ్రహణంతో కొన్ని యధాలాప పరిణామాలు (యిందులో సారూప్య సిద్ధాంతం బదులు ప్రతిఫలనవాదం జ్ఞాన మీమాంస బదులు వచ్చింది, రూపంలో ఏకతీరుని క్రమరీతి ప్రపంచ దృక్పథం సమర్థిస్తూ వచ్చింది.) పొదుకున్నాయి: మార్క్సిస్టు జ్ఞాన అపరిమేయత లేదా సిద్ధాంతరీత్యా యిదే కడపటిది అన్న భావన; శాస్త్రం తత్వశాస్త్రంలో కరిగిపోవడం; యధాతథస్థితి రూపాంతరీకరణ కూడా (సోవియట్ మార్క్సిజంలోని Ansicht రాజీలోలాగ.)

ఎంగెల్స్ "నూతన అపరిమేయం" అంటూ చరిత్ర ప్రకృతీకృత క్రమాన్ని అనుద్దిష్టంగా స్థాపిస్తే, చరిత్ర గమ్యం ఆ అపరిమేయన్నే సాధించడం అని ల్యూకాక్స్ చూపించబోయేడు. యీ అంశాన్నే హెగెల్ చింతనాత్మక తత్వశాస్త్రంలో శుష్కాన్వేషణ చేశాడు. కాని మార్క్స కడకు అర్థశాస్త్రంలో కనిపెట్టేడు: శ్రామికవర్గం భవిష్యత్తు, పాత్ర చరిత్ర కర్త - కర్మ - క్రియలుగా వుంటాయన్న ఆవిష్కరణలో ఎంగెల్స్‌కీ, ల్యూకాక్స్‌కీ "చరిత్ర" సాధకంగా సారలుప్తం అవుతోంది - ఈ ఎంగెల్స్‌కి సంబంధించి "వస్తుపరంగా" ఒక సార్వజనీనక్రమంలో అభివర్గాల పదజాలంతో వివరించడం జరిగింది. ల్యూకాక్స్‌కి సంబంధించి "స్వీయాత్మకంగా" భావించడం జరిగింది. స్వీయ ఆవిష్కరణ అనే తీర్మానాత్మక అనియతచర్యకు యెన్నో మాధ్యమాలు లేదా క్షణాలుగా భావించడం జరిగింది. అదే దాని తార్కిక ఆధారం.

ప్రథమతః యిలాంటి లోటుపాట్లు వున్నప్పటికీ కూడా గతితార్కిక భౌతికవాద, పాశ్చాత్య మార్క్సిస్టు సంప్రదాయాలు రెండూ కూడా

గణనీయమైన గతితార్కికవేత్తల్ని అందించాయి. పాశ్చాత్య మార్క్సిజంలో ల్యూకాక్స్ ప్రతిపాదించిన చారిత్రక చైతన్య గతితర్కం లేదా కర్త - కర్మ గతితర్కంతోబాటు గ్రామ్‌స్కీ సిద్ధాంతం - ఆచరణ. మార్క్యూస్ అంతస్సారం - అస్తిత్వం కొల్లెట్టి (Colletti) దృగ్గోచరం - యదార్థ వైరుధ్యాలు లాంటివి వున్నాయి. యివన్నీ నేరుగా కొంచెం యించుమించులో హెగెల్ మూలస్థానానివే. బెంజమిన్ ప్రకారం గతితర్కం చరిత్రలో విరామ, సంక్షోభాత్మక పార్శ్వాన్ని సూచిస్తుంది. బ్లాక్ ప్రకారం వస్తుగత కల్పితభావన. సార్త్ర్ ప్రకారం వైయక్తిక సమాహార కార్యకలాప అవబోధలో వేళ్ళు దించుకుని వుంది; లెవెబ్రె (Lefebre) ప్రకారం యిది అపరాయీకరణ చెందిన మానవుని గమ్యాన్ని సూచిస్తుంది. హెగెల్ వ్యతిరేక పాశ్యాత్య మార్క్సిస్టులలో (కొలెట్టితో సహా) డెల్లా వోల్పియన్ గతితర్కంలో మౌలికంగా గిరిగీసుకోని, మూలతత్వేతర చింతన వుంది. ఆల్తూస్సేరియన్ గతితర్కం అయితే సంపూర్ణాల సంక్లిష్టత, పూర్వనిర్మాణం, మీరిన నిశ్చితత్వం వుంటాయి. యీ రెండు శిబిరాల మధ్య పీఠం వేసుకుని అడార్నో వున్నాడు. ఆయన ఒక పక్క సర్వవ్యాపకమైన విమర్శని నొక్కిచెప్పాడు, మరోపక్క సాదృశ్యేతర చింతన గురించి నొక్కిచెపుతాడు.

ఇక గతితార్కిక భౌతిక చింతన సంప్రదాయంలోనే ఎంగెల్స్ మూడవ నియమాన్ని నిస్సంకోచంగా స్టాలిన్ వదిలేశాడు. మొదటి నియమాన్ని మావోజెడాంగ్ ప్రత్యేక సందర్భంగా రెండవ స్థానానికి బదలాయించాడు. యిది లెనిన్ నుంచీ క్రమేణా గతితార్కిక భారాన్ని నిర్వహిస్తూనేవుంది. యీ చర్యలకు ఖాయంగా మంచి భౌతికవాద యోగ్యతలున్నాయి (అలాగే రాజకీయమైనవీనీ). నాస్తీకరణకు నాస్తీకరణ నియమం ఒక మార్గం, దాన్నిబట్టి హెగెల్ పరిమితమైన అస్తిత్వాన్ని అపరిమితత్వంలో కరిగించేశాడు. అటుపక్క, గోడెలీయర్ చెప్పినట్టు, గతితార్కిక భౌతికవాదులు వైరుధ్యాలకి సంబంధించి మార్క్సియన్ ఏకతకీ, హెగెలియన్ సారూప్యతకీ మధ్యవున్న భేదాల్ని అరుదుగా గుర్తించారు. యీ సంప్రదాయంలో మావో గణనీయమైనవాడు. సంభావ్యతా సూచక ఫలవంతమైన భేదాల విశ్లేషణకు సంబంధించి - ప్రతిస్పర్థించే, ప్రతిస్పర్థించని వైరుధ్యాలు, ప్రధానమైన ఆనుషంగిక

వైరుధ్యాలు, వైరుధ్యంలోని ప్రధానమైన, రెండవశ్రేణి పార్శ్వాలు వగైరాలు- లెనిన్, ట్రాట్స్కీలలాగా వాటి పరిణామంలోవున్న "సంపుటీకృత, అసమ" స్వభావాల్ని నొక్కిచెప్పడానికి సంబంధించి.

మార్క్సిజం లోపలే, గతితర్కపు సుదీర్ఘ, సంక్లిష్ట చరిత్ర అర్థ స్ఫోరకతలో అయిదు ప్రాథమిక పాయలు ప్రముఖంగా వున్నాయి. 1) హెర్లాకిటస్ నుంచి **గతితార్కిక వైరుధ్యాలు.** యిందులో స్వతంత్రేతర మూలాల నుంచి శక్తుల్లో ప్రతికూలాలు లేదా సంఘర్షణలు యిమిడి వుంటాయి. వీటిని మార్క్స్ గుర్తించాడు. యివి పెట్టుబడిదారీ విధానాన్ని, దాని ఉత్పత్తి విధానాన్ని వేర్పరుస్తాయి. 2) సోక్రటీస్ నుంచి "ఎలంకస్" (Elenchus) లేదా గతితర్కవాదం. దీన్ని ఒకవేపున వర్గపోరాట చిహ్నంగా పరివర్తన చెయ్యడం; మరో పక్క కొంతమంది మార్క్సిస్టు చింతనలో "ఆదర్శపూరిత పరిస్థితుల్లో (గ్రామ్‌స్కీకి కమ్యూనిస్టు సమాజంలో; హెబెర్‌మాన్‌కి నిర్నిబంధమైన ఏకాభిప్రాయం) సత్యానికి ప్రమాణంగా పనిచేయడం. 3) ప్లేటోనుంచి గతితార్కిక హేతువు. దీనికి భావనాత్మక సవ్యత నుంచి నవీనత దాకా విస్తృత పరిధి అర్థాలున్నాయి-యే బాపతు అంటే, అనుభవవాద, తార్కిక నేవథ్య నియంత్రణలకు లోబడి వుండి, శాస్త్రీయ ఆవిష్కరణలో అభివృద్ధిలో కీలకమైన పాత్ర పోషించడం - వికాసం ద్వారా, మార్మికతను తొలగించడం ద్వారా (కాంట్ సమాలోచన), సమష్టి స్వీయ విమోచనకు సంబంధించిన భౌతిక పునాదిలోని గాఢత్వపు తార్కితకు, నియంత్రిత ఆచరణలకు సాగడం. 4) ప్లాటినస్ నుంచి షిల్లర్ దాకా, స్వభావతః వున్న ఏకత, చారిత్రక నిర్దేశిత, విభజిత ఏకత, అవశేషాలు కల గతితార్కిక క్రమం. ఒక పక్క స్థానాపన్న వాస్తవ పరిమితులు లేదా ధ్రువాలు, సరకు రూపంలోని మార్క్స్ సూచిత క్రమరీతి గతితర్కం. మరోపక్క, సోషలిజం కోసం ఆచరణాత్మక పోరాటానికి ప్రేరకంగా పనిచెయ్యడం 5) గతితార్కిక అవబోధ హెగెల్ నుంచి మార్క్స్‌లో సామాజిక వస్తువులు కార్యకారణ ఆవిర్భావ దర్శనసీ, వాటి వివరణాత్మక సమాలోచనకీ కలుపుకొచ్చేటట్టు పరివర్తన చెందింది - వాటి అస్తిత్వం అన్న మాటల్లో; అంటే చారిత్రకంగా నిర్దిష్టం అయినవాటినీ, ఆచరణ ఆధారమైనవాటినీ, నిజానికి అలా కానివాటినీ రెండింటినీ అని.

# గతితార్కిక భౌతికవాదం

గతితార్కిక భౌతికవాదాన్ని మార్క్సిస్టు తత్వశాస్త్రంగా విస్తృతంగా పరిగణిస్తున్నారు. మార్క్సిస్టు శాస్త్రానికి తారతమ్యంగా, సంబంధంతో వున్నటువంటి అది చారిత్రక భౌతికవాదంగా విశిష్టం అయింది. యీ పదబంధాన్ని బహుశా మొదటిసారి ప్లెహనోవ్ 1891లో వాడేడు. మార్క్స్ మరణానంతరం తొలి తరంలో "డయామెట్" (క్లుప్తీకృత పదబంధం వ్యాప్తిలోకి వచ్చింది, ముఖ్యంగా యు.ఎస్.ఎస్.ఆర్‌లో) ఆవిర్భవించింది. మార్క్స్, ఎంగెల్స్‌ల కృషి వాళ్ళ అనుయాయుల్లో యిలా వ్యాప్తిచెందింది. యీ పరిణామం నుంచే మార్క్సిజం స్థిరమైన రూపురేఖలు దిద్దుకుంది. అందులో భాగం గతితార్కిక భౌతికవాదం. (మార్క్సిజం అభివృద్ధిలో యీ అంశం గమనించవచ్చు). మార్క్సిస్టుల తొలితరంలో, యీ సిద్ధాంత స్థాపకుల అతి ప్రసిద్ధ గ్రంథాలు రెండు ఆధిపత్యంలో వుండేవి. మార్క్స్ "పెట్టుబడి", ఎంగెల్స్ "యాంటీ డూరింగ్". పెట్టుబడి చారిత్రక భౌతికవాద మౌలిక ఆర్థిక సూత్రాన్ని తెలియచేసింది. "యాంటీ డూరింగ్" అన్న గ్రంథంలో మార్క్సిజం తత్వశాస్త్రానికి "పరిపూర్తిరూపం" (ప్లెహనోవ్ 1908లో అన్నట్టు) యిచ్చినవాడు ఎంగెల్స్. గతితార్కిక భౌతికవాదం రెండవ ఇంటర్నేషనల్‌లో బలమైన శక్తిగా వుంది. రష్యా విప్లవంతో అది కమ్యూనిస్టు పార్టీ సంప్రదాయ బద్ధతకు ప్రధానాంశం అయింది.

దానికిగా గతితార్కిక భౌతికవాదం రెండు బూర్జువా తత్వశాస్త్రాల సంకర ఉత్పత్తి: శాస్త్రీయ విప్లవం, వికాసయుగంనాటి యాంత్రిక భౌతికవాదం, హెగెల్ భావవాద గతితర్కం. మొదటిదాని సిద్ధాంతం తీరుతెన్నులు గతితర్కంతో పొసగవు, రెండవదాని భావవాదంతో పొసగదు. భావవాదం భౌతికవాదానికి చుక్కెదురు. వీటిలో మొదటిదాన్ని జడవాదం అనీ రెండవది భావవాదపూరితం అనీ కొట్టి పారెయ్యడం జరిగింది. ఫలితంగా "ప్రపంచ దృక్పథం", "కమ్యూనిస్టు ప్రపంచ దృక్పథం" అని ఎంగెల్స్ పిలిచినట్టు, (యాంటీ డూరింగ్, ముందుమాట) ఒక తత్వశాస్త్ర ఆవిర్భావం. నిర్దిష్ట యదార్థాన్ని సంపూర్ణంగా అభివ్యక్తం చేసే సిద్ధాంతరూపంగా గ్రహించినటువంటిది. ఒక అర్థంలో

శాస్త్రీయమైందిగా భావించినటువంటిది. ఒక "ప్రాకృతిక తత్వశాస్త్రం"గా భావించినటువంటిది. ఆయా ప్రత్యేక శాస్త్రాలు పరిణతి చెందే దిశలో పురోగమిస్తూవుంటే వాటి ఫలితాల తోడ్పాటుతో, సామాన్యీకరించేటువంటిది. యీ శాస్త్రాలలో చారిత్రక భౌతికవాద సామాజికశాస్త్రం కూడా వుంటుంది. ఆ రకంగా, మార్క్స్ సైద్ధాంతిక కృషి సమాజాన్ని గురించిన అధ్యయనం అయితే, ఎంగెల్స్ "ప్రకృతిలో గతితర్కం" అన్న సిద్ధాంతాన్ని అభివృద్ధి చేసి (ప్రకృతిలో గతితర్కం) గతితార్కిక భౌతికవాదాన్ని స్థాపించేడు.

ఆయన తన వాదనను, "ప్రకృతిలో... అవే గతితార్కిక నియమాలు... చోదకం అవుతూవుంటాయి... అవి చరిత్రలో... సంఘటనలని నడుపుతాయి." (యాంటీ-డూరింగ్, ముందుమాట) అన్న పరిశీలనమీద ఆధారపడి చేశాడు. గతితార్కిక భౌతికవాదపు కీలక సిద్ధాంతాలు శాస్త్రీయ నియమాల కింద ప్రదర్శితమవుతాయి. సంపూర్తిగా సామాన్య తరహావిగా అందించడం జరిగింది. అవి "ప్రకృతిని, సమాజాన్ని, ఆలోచనను" నడిపిస్తాయి. (యాంటీ-డూరింగ్, మొదటి అధ్యాయం - 13). సాధారణంగా ఎంగెల్స్ చేసిన విశిష్ట కృషిగా, యీ సిద్ధాంతపు రాజకీయ అంశం మార్క్సిజపు శాస్త్రీయతను ప్రతిపాదించడం, చారిత్రక భౌతికవాదానికి ప్రాకృతికశాస్త్రం పొందే సత్యగ్రహణ ప్రామాణికత తోడ్పాటును అందించడం. అదే సమయంలో, డూరింగ్ కృషిలాగా, లేదా "సాంఘిక డార్వినిజం"లాగా అలాంటి హక్కు తమదని వాదించే యితర రాజకీయ సాంస్కృతిక ఉద్యమాలకి దాన్ని లేకుండా చెయ్యడం. (చెంటన్, "మెంఫమ్ అండ్ రూబెన్"లో. 1979.)

భౌతికవాదాన్ని గతితర్కంలో సమ్మిళితం చెయ్యడం వల్ల రెండూ పరివర్తన చెందుతాయి. సరిగా బోధపరచుకుంటే గతితార్కిక భౌతికవాదపు భౌతికవాదం, సాంప్రదాయకంగావున్న ప్రాచీన భౌతికవాదంలాగా కుదించుకుపోయేది కాదు. యిది భావాల్ని పదార్థం స్థాయికి దించదు, వాటి పరమ సాదృశ్యాన్ని ధ్రువపరుస్తూ. భౌతికమైందీ, భావపూరితం అయిందీ భిన్నం అని గతితార్కికంగా యిది చెపుతుంది. నిజానికి యివి వ్యతిరేకాలు. కాని ఒక ఏకతలో వుంటాయి. యిందులో పాదార్థికమైందే ప్రాథమికం లేదా మౌలికం. బుద్ధికి బయటనే పదార్థం వుండగలదు, కాని

పదార్థం లేకుండా బుద్ధి వుండదు. బుద్ధి చారిత్రకంగా పదార్థం నుంచి ఆవిర్భవించింది, దాని మీదనే ఆధారపడి వుంటుంది. పరిణతి చెందిన ప్రత్యేక శాస్త్రాలు ఒక ఏకీకృత సోపానశ్రేణి అవుతాయి. వాటికి పునాదిలో భౌతికశాస్త్రం వుంటుంది. అయితే ఆ శాస్త్రాల్ని భౌతికశాస్త్రం స్థాయికి కుదించడం వుండదు అని దీన్ననుసరించిన సూత్రీకరణ వస్తుంది. జ్ఞాన మీమాంసలో భౌతికశాస్త్రం బుద్ధితో స్వతంత్రించి వస్తుగత యదార్థం అన్న జ్ఞానం వస్తుందన్నదీ దీన్ని అనుసరించే వస్తుంది. గతితర్కంలోని అంశీభూత విషయం ధ్రువపరిచేది యేమిటంటే మూర్త రూప యదార్థ అచలమైన పదార్థం కాదు, యే విచ్ఛిన్నతా లేని ఏకత వున్న పదార్థం కాదు. విరుద్ధాలు వున్న ఏకత, ముఖ్యంగా వైరుధ్య పూరితం అయింది. వైరుధ్యాల సంఘర్షణవల్ల యదార్థాన్ని ఒక చారిత్రక క్రమంలో నిరంతర పురోగామి మార్పువేపు నడిపించడం జరుగుతుంది. యిది పరిణామాత్మకమూ, విప్లవ పూరితమూ కూడా. దీని విప్లవాత్మక లేదా అంతరాయాలతో వున్న మార్పులు గుణాత్మక నవీనతను తీసుకువస్తాయి. యీ గతితార్కపు భౌతికవాద పార్శ్వం బుద్ధిని ఆవిర్భవించే నవ్యతగా ..నగతం చేసుకుంటుంది. తర్కపు అతి మౌలిక బౌద్ధిక స్థాయిలో య..ార్థ.. వున్న యీ వైరుధ్య స్వభావంలో వైరుధ్య ప్రకటనలు యదార్థ విధేయం అన్నది గర్భితం అయివుంది. తత్ఫలితంగా ఒక ప్రత్యేక గతితార్కిక తర్కం అవసరం అవుతుంది, యిది వైరుధ్య రహితం అనే అంశాన్ని ముఖ్య సూత్రంగా కలిగిన మామూలు తర్కాన్ని అధిగమిస్తుంది.

ఆ రకంగా గతితార్కిక భౌతికవాదంలో వున్న మౌలిక నియమాలు:

1) పరిమాణాత్మక మా(ర్పు గుణాత్మక మార్పుగా పరివర్తన చెందే నియమం. దీని ప్రకారం క్రమశః జరిగే పరిమాణాత్మకమార్పులు విప్లవాత్మక గుణాత్మక మార్పులకి శ్రీకారం చుడతాయి. 2) వైరుధ్యాల ఐక్యం నియమం. నిశ్చితంగా వుండే వాస్తవంలోని ఏకత వ్యతిరిక్తాల లేదా వైరుధ్యాల ఏకత అని యీ నియమం చెపుతుంది. 3) నాస్తీకరణకు నాస్తీకరణ నియమం. వైరుధ్యాల సంఘర్షణలో ఒక వైరుధ్యం మరో వైరుధ్యాన్ని నాస్తీకరిస్తుందని, మళ్ళీ అది కూడా చారిత్రక అభివృద్ధి ఉన్నత దశలో నాస్తీకరణనూ చెందుతుందని చెప్పే నియమం. ఆ

అభివృద్ధి ఉన్న దశ యీ రెండు నాస్తీకరణలలో వున్నదాన్ని కొంత పదిలపరుచుకుంటుంది. (యీ క్రమాన్ని కొన్ని సందర్భాల్లో సిద్ధాంత త్రయం ప్రణాళిక ద్వారా సూచించడమూ జరుగుతుంది. భావన (thesis) ప్రతి భావన (anti-thesis) సంయోజన (Synthesis).

మార్క్సు సామాజిక సిద్ధాంతం భౌతికవాద పూరితమూ, గతితార్కికమూ అన్న విషయంలో రెండవ అభిప్రాయం లేదు, అలాగే యిది శాస్త్రీయమైందని ప్రకటించడంలోనూ విప్రతిపత్తి లేదు. శాస్త్రీయజ్ఞత సంజ్ఞేయ అనుకూలం వుందని ప్రకటించుకోవడం యిది సబబే అయినట్లయితే యిప్పటికీ వున్న ప్రాకృతిక శాస్త్రాలలో దీనికి ముఖ్యమైన అవిచ్ఛిన్నతల కొనసాగింపు వుండితీరాలి. కాని ఎంగెల్స్, గతితార్కిక భౌతికవాదం ప్రతిపాదిస్తున్నట్లుగా అయితే దీనికి మరిన్ని యితర, మరింత విశ్వసనీయమైన అవిచ్ఛిన్న కొనసాగింపులు వుండాలి. అంటే మొత్తం యదార్థం గురించి "కమ్యూనిస్టు ప్రపంచ దృక్పథం" గురించి సామాన్య సిద్ధాంతంలో భాగంగా వుండే విషయం వుండాలి. యేమైనప్పటికీ గతితర్కం, భౌతికవాదం ఐక్యం కావడంలో ఒక సమస్యాత్మక సాగుతీత వుంది. ముఖ్యంగా ప్రకృతి శాస్త్రాల భౌతికవాదం సంబంధిగా. యీ శాస్త్రం యాంత్రిక కుదింపునకీ, పాక్షికంగాని వస్తుగత తత్వానికీ బలంగా మొగ్గుతో వుండడంవల్ల. మార్క్సిజం లోపల, గతితార్కిక భౌతికవాదం లోపల విశిష్టంగా వున్న అంశం యేమిటీ అంటే ప్రకృతిశాస్త్రాలనీ, సమాజం గురించిన ప్రాకృతికశాస్త్రంగా చారిత్రక భౌతికవాదాన్ని నొక్కి చెప్పడం. ఫలితంగా గతితార్కిక భౌతికవాదం చారిత్రక భౌతికవాదాన్ని "ఆర్థిక తత్వం" వేపు నెట్టింది. అంటే సమాజపు భౌతిక పునాదిగా, ఆర్థికత మాత్రమే, యింకా చెప్తే దాని "అతిభౌతిక" పార్శ్వం మాత్రమే, ఉత్పాదక సాంకేతికశాస్త్రం, నిజమైన కార్యకారణ సంపత్తి కలిగి వుంది, రాజకీయ సైద్ధాంతిక ఉపరితల నిర్మాణం అనేవి అల్పాయుష్కమైనవి. లెనిన్, మావొజెదాంగ్‌లు ఉభయులూ "కమ్యూనిస్టు ప్రపంచ దృక్పథానికి" నిబద్ధమైన ప్రబోధకులు, వాళ్ళు ఆర్థికతను ప్రతిఘటించారు. కాని దాని విప్లవ వ్యతిరేక ఫలితాలు రెండవ ఇంటర్నేషనల్ మార్క్సిజంలో, తర్వాత అధికార సంప్రదాయ కమ్యూనిస్టు పార్టీలో దర్శనమిచ్చాయి.

1920లలో, 30లలో రష్యన్ విప్లవం స్టాలినిస్టు నియంతృత్వానికి పార్టీ అధికార యంత్రాంగానికి పతనం అయింది. అప్పుడు గతితార్కిక భౌతికవాదం మార్క్సిస్టు తత్వశాస్త్రాన్ని సాధారణంగా అధిపత్యంలో వుంచుకోవడం యు ఎస్ ఎస్ ఆర్ బయట కూలిపోవడం మొదలైంది. దాన్నుంచి రెండవ మార్క్సిస్టు తత్వశాస్త్రం, మార్క్సిస్టు మానవతావాదం వచ్చింది. దీని ప్రముఖ సిద్ధాంతవేత్తలు ల్యూకాక్స్, కోర్ష్. వాళ్ళు ప్రాకృతిక శాస్త్రాల భౌతికవాదాన్ని తిరస్కరించారు. వాళ్ళు హెగెలియన్ గతితర్కం గురించి నొక్కి చెప్పేరు. దాంతో మార్క్స తొలి తాత్విక రచనల పునరావిష్కరణ ధ్రువపడింది. యిలా హెగెల్ మయం చేసే ధోరణుల్ని అల్తూస్సర్, డెల్లా వొల్పె శాఖలు గత రెండు దశాబ్దాలుగానూ తీవ్రంగా దాడిచేశాయి. పాశ్చాత్య మార్క్సిజానికి తారతమ్యంగా సోవియట్ మార్క్సిజం "డయామెట్"కి సాధారణంగా అంటిపెట్టుకునే వుంది. అయితే యిటీవల మామూలు తర్కాన్ని అధిగమించే ప్రత్యేక గతితార్కికం అన్న భావన తిరస్కారానికి గురయే ధోరణి యిటీవల వస్తోంది.

# చారిత్రక భౌతికవాదం

"చరిత్ర గురించిన భౌతికవాద దృక్పథం" అని ప్రాచుర్యం పొందిన సిద్ధాంతంలోని గుండెకాయని నిర్దేశించే పదబంధం యిది. యిది మార్క్సిస్టు సిద్ధాంతంలోని సామాజికశాస్త్రీయ మూలభూత అంశం. ఏంగెల్స్ "సోషలిజం, ఊహాజనితం, శాస్త్రీయం" అన్న గ్రంథానికి 1892లో ముందుమాట రాస్తూ చారిత్రక భౌతికవాదం గురించి యిలా రాశాడు:

చరిత్ర గతి గురించిన దృక్పథాన్ని నిర్దేశిస్తుంది. సమాజ ఆర్థికాభివృద్ధిలోని సకల ముఖ్య చారిత్రక సంఘటనలకీవున్న అంతిమ కారణాన్ని, మహాచోదక శక్తినీ యిది అన్వేషిస్తుంది. ఉత్పత్తి సాధనాలూ, వినిమయమూ పొందే మార్పులు పర్యవసానంగా సమాజం విస్పష్ట వర్గాలుగా విడిపోవడం, ఒకదానితో ఒకటి యీ వర్గాలు పోరాటం చెయ్యడం అన్వేషిస్తుంది.

మార్క్సని చారిత్రక భౌతికవాద స్రష్టంగా ఎంగెల్స్ కీర్తించాడు. మార్క్స రెండు మహత్తర శాస్త్రీయ ఆవిష్కరణల్లో యిది ఒకటని ఎంగెల్స్

అన్నాడు. (రెండవది అదనపు విలువ సిద్ధాంతం.) ఏంగెల్స్ తనకిగా స్వతంత్రంగానే చరిత్ర గురించిన భౌతికవాద దృక్పథాన్ని చేరుకున్నాడని మార్క్స్ రాశాడు. సిద్ధాంతానికి అనుగుణంగానే వాళ్ళు, యిది రూపుతీసుకోవడంలోవున్న చారిత్రక, భౌతిక పూర్వ నిబంధనల్ని యెత్తి చూపించారు.

మార్క్స్ తొలి రచనలకీ, తరవాతి రచనలకీ మధ్య అనేక అంశాలకు సంబంధించి అవిచ్ఛిన్నతా స్థాయి యెలా వుందీ అన్న అంశం గురించి విద్వాంసులు మత భేదాలతో వున్నారు. అయినా చారిత్రక భౌతికవాద దృక్పథం గురించి మార్క్స్, ఎంగెల్స్ "జర్మన్ భావజాలం" (1845–46) నాటికే వ్యూహం తయారు చేసుకోవడం మొదలు పెట్టారన్న విషయాన్ని యెవళ్ళు కాదనడంలేదు – దానికి అందుకు తగ్గ బౌద్ధిక నేపథ్యం కాదనలేకపోయినా. యీ దృక్పథం వాళ్ళ ప్రపంచ దృక్పథంలో విశిష్టంగా వుందన్న విషయాన్ని వాళ్ళు భావించారు. మార్క్స్, ఎంగెల్స్‌ల రచనల్లో యీ భావన గురించి రేఖా మాత్ర చిత్రణలు వున్నాయి. అయితే యివి, వాళ్ళల్లో యెవళ్ళో ఒకళ్ళు, 1844–45కి ముందు గుర్తింపు పొందిన యీ మార్క్సిస్టు దృక్పథాన్ని చేరుకున్నట్టు సూచించవచ్చు, సూచించకపోనూవచ్చు. యీ సమయంలో (1845–46) వాళ్ళు చైతన్యయుతంగా చారిత్రక భౌతికవాదాన్ని వినియోగించుకున్నారు. దీన్ని మార్క్స్ చెప్పినట్టు తమ తరవాతి రచనలకి "నిర్దేశక సూత్రంగా" వాడుకున్నారు.

నిక్కచ్చిగా చెప్పుకోవాలీ అంటే చారిత్రక భౌతికవాదం ఒక తత్వశాస్త్రం కాదు. ఘనంగా నిర్వచించుకోవాలీ అంటే ఒక అనుభవవాద సిద్ధాంతం (లేదా, మరింత నిర్దిష్టంగా అనుభవాధార సూత్రీకరణల సేకరణ). ఆ రకంగా మార్క్స్, ఎంగెల్స్‌లు తమ ప్రయత్నంలోని శాస్త్రీయ స్వభావాన్ని ప్రముఖం చేసుకున్నారు. దీని వైఖరి తాత్వికంగా నిగ్గతీసిన నైరూప్యాలమీదగాని నమ్మకాలమీదగాని ఆధారపడి వుండదనీ పరిశీలన మీద, వాస్తవ పరిస్థితుల నిర్దుష్ట చిత్రణమీదా ఆధారపడి వుంటుందనీ "జర్మన్ భావజాలం" అన్న గ్రంథం చాటుతోంది. సూక్ష్మంగా చెప్పుకోవాలీ అంటే "శుద్ధ అనుభవాధార పద్ధతిలో నిగ్గుతేల్చగల" ఊహల మీద ఆధారపడుతుందనీ చాటుతోంది. సందర్భవశాత్తూ మార్క్స్,

ఎంగెల్స్‌లు చారిత్రక భౌతికవాదానికి వత్తాసుగా నిగమన విధాన వాదనలు ముందుపెడతారు. అయితే యివి అంత గాఢాసక్తికరంగా వుండవు. చరిత్ర స్వభావం గురించీ, సమాజం గురించీ యింతటి సాహసోపేత ప్రకటనలు చేసే ఒక సిద్ధాంతం యెలా రూఢమవుతుంది? సామాజిక, చారిత్రక పరిశీలనలకు సాధ్యమయే పరిశోధనా కార్యక్రమాన్ని అందించే సత్తావల్లనే.

ఈ ప్రకటనలకి మార్క్స్ "ఎ కంట్రిబ్యూషన్ టు ద క్రిటిక్ ఆఫ్ పొలిటికల్ ఎకానమీ" అన్న గ్రంథానికి రాసిన "ముందుమాట"లో వున్న ఒక సాంద్రమైన భాగం చిరస్మరణీయమైనవాదన జవాబు యిస్తుంది. యీ "ముందుమాట" విశ్వసనీయతను సంశయించడం జరిగిందనుకోండి, అయినా దీని ప్రామాణికత తగినంత వెనక దన్నుతోనే వుంది. అదేమిటీ అంటే మార్క్స యీ అంశం గురించి తన భౌతికవాద దర్శనకు మార్గదర్శకంగా వుండేటట్టు కనీసం రెండుసార్లు, "పెట్టుబడి"లో ప్రస్తావించాడు. యీ "ముందుమాట"లోని విషయాలు మార్క్స్ రచనా సముదాయమంతటిలోనూ మార్మోగుతూనే వుంటాయి. సరే, వాటికి యితర సందర్భాల్లో అందిన విపులీకరణ నేపథ్యంలోనే వాటిని వివరించుకోవాలనుకోండి. సమాజపు ఆర్థిక నిర్మాణం, దాని ఉత్పత్తి సంబంధాలతో యేర్పాటై వుంటుంది, అదే సమాజానికి నిజమైన పునాది అని మార్క్స్ "ముందుమాట"లో ప్రతిపాదిస్తాడు. యీ పునాది మీదనే "చట్టపర, రాజకీయ ఉపరితల నిర్మాణం యేర్పాటవుతుంది. ఆ ఫలానా సామాజిక చైతన్య రూపాలు దీనికి అనురూపంగానే వుంటాయి" అని మార్క్స అంటాడు. యిక మరో పక్క సమాజ ఉత్పత్తి సంబంధాలు వాటికిగా అవే "సమాజ పాదార్థిక ఉత్పత్తి శక్తుల అభివృద్ధిలోని నిర్దిష్ట దశకు అనురూపంగా వుంటాయి." యీ రకంగా "భౌతిక జీవిత ఉత్పత్తి విధానం సామాజిక, రాజకీయ, బౌద్ధిక జీవితాన్ని సాధారణంగా నియంత్రిస్తుంది."

సమాజపు ఉత్పత్తి శక్తులు అభివృద్ధి చెందుతూ వుంటాయి. అలా జరిగేటప్పుడు వాటికీ, మనుగడలోవున్న ఉత్పత్తి సంబంధాలకీ మధ్య ఘర్షణ వస్తుంది. అవి పెరుగుదల సాగకుండా ఉత్పత్తి శక్తులకి సంకెళ్ళలా అడ్డం పడతాయి. "అప్పుడు సాంఘిక విప్లవ యుగం"

మొదలవుతుంది. యేమంటే యీ వైరుధ్యం సమాజాన్ని చీలుస్తుంది. ప్రజలు సుమారుగా భావజాల రూపంలో 'యీ వైరుధ్యం గురించిన ఎరుక పొందుతారు, దాన్ని పరిష్కరించుకుంటారు.' యీ ఘర్షణ ఉత్పత్తిశక్తులకు అనుకూలంగా పరిష్కారం అవుతుంది. నూతన, మరింత ఉన్నత ఉత్పత్తి సంబంధాలు వస్తాయి. వాటికి తగ్గ భౌతిక పూర్వావసరాలు "పాత సమాజపు గర్భంలో పరిణతి చెందివుంటాయి." ఆ ఉన్నత ఉత్పత్తి సంబంధాలు సమాజపు ఉత్పాదక సామర్థ్యాన్ని మరింత పొందికగా అమరుస్తాయి. సమాజం అనే ప్రవర్ధమాన యుగాల్ని ఆర్థిక నిర్మాణంలో చూసింది. వీటిలో బూర్జువా ఉత్పత్తి విధానమే చాలా ఆధునికం అయినటువంటిది. కాని ఉత్పత్తికి సంబంధించి యిదే కడపటి విరోధపూరిత రూపం.

పైన చెప్పుకున్న దాన్నిబట్టి తేలేది యేమిటి? చారిత్రక భౌతికవాద ఆయువుపట్టు సూత్రీకరణ - కొంతమంది మార్క్సిస్టులు త్యజించినప్పటికీ- మానవ చరిత్రను విశిష్టం చేసిన విభిన్న సామాజిక ఆర్థిక ఉత్పత్తి వ్యవస్థలు సమాజపు ఉత్పాదక సామర్థ్యం విస్తరించడానికి అనుకూలంగానో, ప్రతికూలంగానో వుండేదానిమీద ఆధారపడే పైకి లేస్తాయి లేదా పతనమవుతాయి. ఆ రకంగా ఉత్పత్తిశక్తుల పెరుగుదల మానవ సమాజ చరిత్ర సాధారణ గతిని వివరిస్తుంది. అలాగని ఉత్పత్తి శక్తులలో వొట్టి ఉత్పత్తి సాధనాలు మాత్రమే వుండవు. (అంటే పనిముట్లు, యంత్రాలు, ఫాక్టరీలు వగైరా, వగైరా) అందులో శ్రమశక్తి కూడా వుంటుంది. అంటే పనిలో వినియోగించే నైపుణ్యాలు, పరిజ్ఞానం, అనుభవం తదితర మానవబుద్ధి విశేషాలు. ఉత్పత్తిశక్తులు పాదార్థిక ఉత్పత్తి చేతిలోవున్న సమాజశక్తుల్ని ప్రతిబింబిస్తాయి.

ఉత్పత్తి సంబంధాలు సమాజపు ఉత్పత్తి స్థాయితో అనురూపంగా వుంటాయని కదా చెప్పుకుంటూవున్నది, అవి ఉత్పత్తిక్రమంలో ఉత్పత్తి శక్తుల్ని, మానవుల్నీ అనుసంధించి వుంచుతాయి. యీ సంబంధాలు స్థూలంగా రెండు రకాలని: అసలు ఉత్పత్తిక్రమం ముందుకు సాగేందుకు అవసరం అయిన సాంకేతిక సంబంధాలు ఒకవైపు; మరోపక్క ఆర్థిక నియంత్రణ సంబంధాలు (చట్టపరంగా చెప్పాలీ అంటే ఆస్తి

యాజమాన్యం) యివే. ఉత్పత్తి సంబంధాలనీ, ఉత్పత్తులనీ నడిపిస్తాయి. తారతమ్యం భౌతిక శ్రమ సంబంధాలకీ, వాటి సామాజిక ఆర్థిక సంబంధమైన పై పొరకీ మధ్యనే వుంటుంది. యీ రెండింటినీ కలగాపులగం చేసే వాళ్ళనే మార్క్స్ పదేపదే విమర్శించాడు. ఆర్థిక నిర్మాణ రకాలు వాటి ఆధిపత్య సామాజిక ఉత్పత్తి సంబంధాలవల్లనే వేరు అవుతాయి. "ఉత్పత్తి సామాజిక రూపమేదైనప్పటికీ, శ్రామికులు, ఉత్పత్తి సంబంధాలు యెప్పుడూ ఉత్పత్తి కారకాలుగా వుంటున్న మాట నిజం.... యీ సంయోగం జరిగే నిర్దిష్టరీతి సమాజ నిర్మాణ స్వరూపానికి సంబంధించిన భిన్న ఆర్థిక శకాలను ఒక దాని నుండి మరొక దాన్ని వేరు చేసి చూపిస్తుంది." (పెట్టుబడి 2, అధ్యాయం 1.)

ఉత్పత్తి విధానం అనేదానికి అనుసంధించి వుండే భావన కూడా యిదే రకంగా సందిగ్ధంగా వుంది. కొన్ని సందర్భాల్లో మార్క్స్ దీన్ని ఉత్పత్తి పద్ధతులు లేదా సాంకేతిక స్వభావపు అర్థంలో పరిమితంగా వాడేడు. పెట్టుబడిదారీ విధానం, "ఉత్పత్తి విధానంలో నిరంతరాయంగా విప్లవాల్ని ప్రవేశపెడుతూనే వుంటుంది" అని చెప్పే సందర్భాలలోలాగా యెక్కువగా మార్క్స్ ఉత్పత్తి పద్ధతులు అన్న ఉద్దేశ్యంలోనే వాడేడు. అంటే ఉత్పత్తి సామాజిక వ్యవస్థ (లేదా పద్ధతి, వైఖరి) కొన్ని యాజమాన్య సంబంధాల లోపల, వాటి ఫలితంగా సాగుతుంది అన్న అర్థంలో. ఆ రకంగా పెట్టుబడిదారీ ఉత్పత్తి సంబంధాలు ప్రజలకీ, ఉత్పత్తిశక్తులకీ మధ్య వుండే ప్రత్యేక బంధాన్ని వివరిస్తాయి. పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానంలో సరుకుల ఉత్పత్తి వుంటుంది, అదనపు విలువను పొందే ఒక తరహా పద్ధతి వుంటుంది, విలువను నిర్ణయించే శ్రమ సమయం వుంటుంది. యింకా అలా అలా అన్నమాట. (దీనికి తోడుగా మార్క్స్ కొన్ని సందర్భాల్లో "ఉత్పత్తి విధానం" అనే పదబంధాన్ని ఉత్పత్తి కొనసాగడంలో యిమిడి వున్న సాంకేతిక, సామాజిక ద్రవ్యాలు రెండింటినీ మేళవించుకునే అర్థంలోనూ వాడేడు) యే ఫలానా వాస్తవ సామాజిక నిర్మాణంలోనేనా ఒక తరహా ఉత్పత్తి విధానంకంటే యెక్కువే వుండచ్చు. కాని "గుండ్‌రిస్సె"కి రాసిన "ముందుమాట"లో యింకోమాట అన్నాడు: "సమాజపు అన్ని రకాలలోనూ, నిర్ణాయకమైన ఉత్పత్తి తరహా ఒకటి వుంటుంది. అది మిగిలిన అన్నింటి శ్రేణుల్ని యేర్పాటు చేస్తుంది, ప్రభావితం చేస్తుంది."

ఉత్పత్తిశక్తుల విస్తృతి - ఉత్పత్తి సంబంధాల్ని, ఉత్పత్తి విధానాన్నీ నిర్ణయిస్తుంది. అవి అలా దక్కినటువంటివి. యేమంటే మార్క్స్ అన్నేకోవ్‌కి రాసినట్టు, "మనుషులు తాము సాధించుకున్నదాన్ని యెన్నడూ వదులుకోరు." "నాగరికత సాధించిన ఫలితాల్ని నిలబెట్టుకుందుకు, వాళ్ళు ఉత్పత్తి మార్గాన్ని మార్చుకుంటారు - వాళ్ళ పాదార్థిక లేదా భౌతిక ఉత్పత్తి సంబంధాల్ని గాని లేదా రెండింటినీ గానీ - యెందుకూ అంటే వాళ్ళు సంపాదించుకున్న ఉత్పత్తిశక్తుల్ని అనుగుణ్య పరచుకోవడానికి, పురోగతి సాగడం అనుకూలం కావడానికి అలా చిక్కిన ఆర్థిక నిర్మాణం మళ్ళీ న్యాయపర, రాజకీయ ఉపరితల నిర్మాణాన్ని తీర్చిదిద్దుతుంది. ఆ రకంగా ఉత్పత్తిశక్తులు సామాజిక ప్రపంచాన్ని యెకాయెకీ తీర్చిదిద్దెయ్యవు. చరిత్ర స్థూలరేఖలు మాత్రమే, సమాజపు సాంఘిక, ఆర్థిక పరిణామంలోని ప్రధాన రూపాలే, సమాజపు ఉత్పాదక సామర్థ్య అభివృద్ధిచేత నిర్ణయం అవుతాయి.

ఉత్పత్తి సంబంధాలు ఉత్పత్తిశక్తుల అభివృద్ధిలోని చురుకునీ, గుణాత్మక దిశనీ ప్రభావితం చెయ్యగలవు. పెట్టుబడిదారీ ముఖ్యంగా అంతకుముందెన్నడూ కలగని యెరుగని రీతిలో ఉత్పత్తి స్థాయికి సమాజాన్ని తీసుకుపోయే ధోరణితో విశిష్టం అయింది. యిది చారిత్రక భౌతికవాద పంథాలోనే వుంది. యిది మార్క్స్ సూత్రీకరణబట్టే వుంది. యేమంటే, ఆవిర్భవించిన ఉత్పత్తి సంబంధాలు అవి సమాజపు ఉత్పాదక సామర్థ్య అభివృద్ధిని ముందుకు తీసుకుపోవాలి కాబట్టి యేమైనా అలానే కచ్చితంగా వుంటాయి. దీనికి సంబంధించి ఒక విషయాన్ని తరచూ గుర్తు చేసుకుంటున్నారు. అదేమిటీ అంటే, పెట్టుబడిదారీ సమాజ ఆవిర్భావాన్ని సూచించే ఉత్పత్తిశక్తులు - ఉదాహరణకు, భారీస్థాయి యాంత్రీకృత ఉత్పత్తికి సూచకమైన ఫాక్టరీలు, యంత్రాలు - పెట్టుబడిదారీ విధానానికి విశిష్టంగావున్న శక్తులేకావు. చారిత్రక భౌతికవాదం, ప్రకృతంలోవున్న ఉత్పత్తిశక్తుల స్థాయికి ప్రతిస్పందనగా పెట్టుబడిదారీ విధానం ఆవిర్భవించిందని దర్శిస్తుంది.

సంబంధాలు, శక్తులు పరస్పర ఆధారితాలు అని చెపుతూ ఉత్పత్తి శక్తుల ఆధిపత్య పాత్రను కొంతమంది యీనాటి మార్క్సిస్టులు కొట్టిపారేస్తున్నారు. మార్క్స్ వాటి పరస్పర ప్రతిచర్యలను కచ్చితంగా

గుర్తించాడు. నిజానికి ఉత్పత్తిశక్తుల్ని ప్రభావితం చేసే సంబంధాల గురించిన ప్రత్యేక సందర్భాల్నీ వివరించాడు. అయినా కూడా ఆయన సామాన్య సైద్ధాంతిక ప్రకటనల్లో మౌలిక నిర్ణాయకత మరోలా సాగుతుంది. చారిత్రక భౌతికవాదం ఉత్పత్తిశక్తుల వివరణాత్మక ప్రాధమ్యం పొందుతూ వుండబట్టి, భిన్న సామాజిక, ఆర్థిక నిర్మాణాలు తలెత్తినప్పుడు అవి యెందుకు అలా వచ్చాయో నన్నదానికి యిది జవాబు యివ్వగలుగుతోంది.

మార్క్స్‌కి సమాజంలోని న్యాయపర, రాజకీయ వ్యవస్థలు స్పష్టంగా ఉపరితల నిర్మాణాత్మకమైనవే: వాటి మౌలిక స్వభావం మనుగడలోవున్న ఆర్థిక నిర్మాణం నిర్ణయిస్తుంది. యే యితర సాంఘిక వ్యవస్థలు సరిగా ఉపరితల నిర్మాణంలో భాగంగా వుండేదీ అన్న విషయం చర్చనీయాంశంగా వుంది. సమాజంలోని వివిధ రంగాలు, పరిధులు ఉత్పత్తి ఆధిపత్యం విధానాన్ని ప్రతిఫలిస్తూ వుంటాయనీ, దాని ఉత్పత్తి స్వభావం బట్టి ఆ యుగ సాధారణ చైతన్యం రూపుతీసుకుంటుందనీ మార్క్స్ భావించాడు. "భావజాలం" సిద్ధాంతం గురించి మార్క్స్ రాశాడు. అస్తిత్వంలోవున్న సామాజిక సంబంధాల ఆమోదం వుండబట్టి లేదా ఆ ఫలానా వర్గ ప్రయోజనాలని వెనకేసుకురావడం బట్టి ఆయా భావాలు పుట్టుకొస్తాయి లేదా వ్యాప్తిలో వుంటాయి అని యిందులో వాదించడం కనిపిస్తుంది. న్యాయపర, రాజకీయ నిర్మాణాలపైన ఆర్థికస్థితి నిర్ణాయకత్వం వున్నప్పటికీ, అది సాపేక్షంగా నేరుగా వున్నప్పటికీ, యితర సాంఘిక పరిధులమీద, సంస్కృతి, చైతన్యాలమీద యిది అంత బలంగా వుండదు. సూక్ష్మంగా వుంటుంది. సామాజిక జీవితరంగాల్లో చారిత్రక భౌతికవాదం ఒక సామాన్య సోపానశ్రేణిని గ్రహిస్తుంది. కానైతే యీ సంబంధాల్ని విస్తృత పరచు కోవాలి; సాధారణంగా ఒట్టి సమాజానికి మాత్రమేకాదు, కాని ప్రతి ప్రత్యేక సామాజిక, ఆర్థిక వ్యవస్థకీ కూడా. ఉపరితల నిర్మాణం అనేది పునాది నుంచి వస్తుందన్నది మార్క్స్ నియమం. కాని యిది నియమాల గురించిన నియమం; ప్రతి సామాజిక నిర్మాణంలోనూ యీ సాధారణ నిష్పాదన నిర్దిష్ట స్వభావాన్ని మరింత నిర్దిష్ట నియమాలు పాలిస్తాయి. దీనికి సరితూగేటట్టు పెట్టుబడి మొదటి సంపుటం (1 అధ్యాయం, విభాగం 4)లో వున్న అధోజ్ఞాపిక ఒక విషయాన్ని సూచిస్తుంది. అదేమిటీ అంటే ఒక యుగంలోని ఉత్పత్తి

విధానం ఆకాలంనాటి సాంఘిక ప్రపంచంలోని వివిధ రంగాల సాపేక్ష ప్రాముఖ్యాన్ని నిర్ణయిస్తుందని చెప్పడం. పునాది, ఉపరితల నిర్మాణం అన్న ఉపమానంవల్ల పరికల్పన చేసిన నిర్మాణ విధానాల స్వభావం, పట్టు అనేవి, యేది యేమైనా, చారిత్రక భౌతికవాదంలో చిక్కుపెట్టే, వివాదాస్పద సమస్యలుగానే మిగిలిపోయేయి. ఉపరితల నిర్మాణాన్ని మార్క్సిస్టు సిద్ధాంతం ఆర్థిక పునాదికి ఆనుషంగిక లక్షణంగా భావించదు, న్యాయపర రాజకీయ వ్యవస్థల అవసరాన్నీ ఉపేక్షించదు. యేమంటే యీ ఆర్థిక వ్యవస్థ తెచ్చిపెట్టే ఉపరితల నిర్మాణం ఆ సమాజాన్ని వ్యవస్థీకరించి స్థిరీకృతం చెయ్యడానికి, దానికి చక్కగా నప్పేటట్టు, అవి అవసరం., అలాగని ఉపరితల నిర్మాణం, పునాది అనేవి శిలా విగ్రహమూ, దాని పాదపీఠమూ కావు. ఉపరితల నిర్మాణం పునాదిమీద "ప్రతిచర్య కలిగిస్తుంది" లేదా ప్రభావితం చేస్తుంది. అన్నది చారిత్రక భౌతికవాదంలోని మౌలిక సూత్రాల్లో ఒకటి.

చట్టం మరీ ముఖ్యంగా "అస్తిత్వంలోవున్న పద్ధతిని సవ్యం చెయ్యడానికి" అవసరం. "దానికి యాదృచ్ఛికత నుంచి, నిరంకుశత్వం నుంచీ స్వతంత్రత" కల్పించడానికీ అవసరం. (పెట్టుబడి 3, అధ్యాయం 47). ఆ కర్తవ్యమే చట్ట పరిధికి కొంత స్వయం ప్రతిపత్తిని కలిగిస్తుంది. యేమంటే అస్తిత్వంలో వున్న ఉత్పత్తి సంబంధాల్ని గ్రహణీయ, నియమబద్ధ రూపంలో ప్రతిఫలింప చెయ్యడమూ, చట్టబద్ధం చెయ్యడమూ జరుగుతుంది. అది మళ్ళీ, న్యాయం అనేది సొడ్డు పెట్టడానికి లేని తీరులో స్వయం ప్రతిపత్తితో వున్నట్టు, ఆర్థిక నిర్మాణానికి సంబంధించి యీ స్వయం ప్రతిపత్తి వున్నట్టూ భావనాత్మక భ్రమను కలిగిస్తుంది. దీనికి తోడు పెట్టుబడిదారీ విధానంలో స్వేచ్ఛాయుత నిర్వాహకుల మధ్య "ఒప్పందం కుహనా న్యాయం" ఉత్పత్తి స్వభావాన్ని మసక పరుస్తుంది. ముఖ్యంగా వేతన కార్మికుని పెట్టుబడికి బంధించి పడవేసే "అదృశ్య సూత్రాల్ని మసక బారుస్తుంది. (పెట్టుబడి 1, అధ్యాయం 23). పెట్టుబడిదారీ పూర్వ సమాజాల్లో, ఉదాహరణకు ఫ్యూడలిజంలో, సంప్రదాయం, ఆచారం యిదే మాదిరి స్థిరం చేసే కర్తవ్యాన్ని నిర్వహించేవి, అవీ అంతో యింతో స్వయం ప్రతిపత్తిని సంపాదించుకునేవి. అక్కడ ఉత్పత్తి సామాజిక సంబంధాల అసలు

స్వభావం బంధనాల చిక్కుముళ్ళతో మసక కమ్ముకుపోయి వుండేవి. వ్యక్తిగత ప్రభావాల సంబంధాలలో అవి వుండేవి. యివి ఫ్యూడల్ జీవితపు యితర రంగాలనీ విశిష్టం చేసేవి.

వర్గ విశ్లేషణ గురించి మార్క్స్ వక్కాణింపు "ముందుమాట"లో లేకపోవడం ఆశ్చర్యకరం. పై అంశాలతో చారిత్రక భౌతికవాదాన్ని అనేక ప్రముఖ పద్ధతుల్లో అనుసంధిస్తుంది. ఉత్పత్తి సామాజిక నిర్వహణలో ప్రజలు ఉత్పత్తిశక్తులకి, ఉత్పత్తులకి సంబంధించి విభిన్న సంబంధాలతో వుంటారు. యే సమయంలోని ఉత్పత్తి విధానంలోనేనా యీ సంబంధాలు కొన్ని విశిష్ట అంశాలతో వుంటాయి. అప్పటికి అస్తిత్వంలో వున్న సాంఘిక ఉత్పత్తి సంబంధాల నేపథ్యంలో అవగాహన అయే వైయక్తిక ఆర్థిక పరిస్థితి యితరులతో ఉమ్మడిగా వుండే పాదార్థిక ప్రయోజనాలని స్థాపిస్తుంది, వర్గ సభ్యత్వాన్ని నిర్ణయిస్తుంది. అంచేత బూర్జువావర్గం, శ్రామికవర్గం అనే పరిచిత నిర్వచనాలని అనుసరించి కొనుగోలు, అమ్మకం క్రమంగా సూచితమవుతాయి. అంటే శ్రమశక్తి కొనుగోలు (ఉత్పత్తి సాధనాలమీద స్వామ్యం వుండడం లేకపోవడం అన్న విషయం వుంటుంది.)

చారిత్రక భౌతికవాద మూల అంశం వర్గస్థానం అని నిర్వచించి నటువంటిది. అది ఆయా వర్గాల వాళ్ళ ప్రపంచ దృక్పథాన్ని లేదా చైతన్యాన్ని నిర్ణయిస్తుంది. ఉదాహరణకు "18వ బ్రూమేర్"లో లెజిటిమిస్టుల గురించి, ఆర్లియనిస్టుల గురించి మార్క్స్ చేసిన చర్చ. ప్రతివర్గమూ దాని దాని సాంఘిక ఆర్థికస్థాయిని బట్టి "మొత్తం ఒక ఉపరితల నిర్మాణాల్ని సృష్టించుకుంటుంది. ప్రత్యేకంగా ఈ చిత్రంగా యేర్పడ్డ ఆవేశానురాగాలు, భ్రమలు, ఆలోచనా సరళులు, జీవిత దృక్పథాలు యిందులో వుంటాయి." యీ అంశాన్ని మార్క్స్ యిక్కడ నొక్కిచెప్పేడు. వర్గాలలో ప్రయోజనాలు విభిన్నంగా వుంటాయి. అవి వాళ్ళని విభజిస్తాయి. వాళ్ళను పోరాటాలకి నడిపిస్తాయి. వర్గాలు విస్తృతిలో యెలా విభిన్నం అవుతాయి అంటే వాటిల్లో వుండే సభ్యులు తాము ఒక వర్గం సభ్యులం అని భావించేటంతవరకూ, అలా అయితే ఆ సభ్యులు వర్గాల మధ్య విరోధాలు యేమిటో విమర్శగా చూసుకోలేరు. లేదా యేదో మార్మికభావనతో లేదా భావజాలరూపంలో మాత్రమే అవగతం చేసుకుంటారు.

ఒక వర్గం అంతిమంగా విజయం సాధించడమో, విఫలం కావడమోననేది ఉత్పత్తిశక్తుల పురోగతిని బట్టి నిర్ణయమవుతుంది. జర్మన్ భావజాలంలోని మాటల్లో చెప్పుకోవాలీ అంటే, "ఆ ఫలానా ఉత్పత్తిశక్తులు అనువర్తించే పరిస్థితులు యేమిటీ అంటే ఆ ఫలానా సమాజవర్గ పాలనా పరిస్థితులు". ఉత్పత్తిశక్తులు పురోగమించడానికి అవసరం అయిన ఉత్పత్తి సంబంధాల్ని నిలిపి వుంచు కోవడానికో లేదా ప్రవేశపెట్టే చొరవ, సామర్థ్యం యిమిడించు కోవడానికో సన్నద్ధమైన వర్గం తన ఆధిపత్యాన్ని పదిలం చేసుకుంటుంది. ఆ రకంగా మార్క్స్, అంతకుముందు బూర్జువా వర్గం పైకి వచ్చినట్టుగానే శ్రామికవర్గం దరిమిలా విజయం సాధించడం అనేది చారిత్ర మౌలిక వాహినుల మీద భరోసాతో వుంటుంది అని భావించాడు. ఉదాహరణకు ప్రాచీన ప్రపంచంలో వీరోచిత పోరాటాలు విఫలం అవడం, అది తప్పదు. చారిత్రక భౌతికవాదం యిప్పటిదాకా వున్న పాలనను తప్పనిసరి అనీ, అవసరం అనీ భావిస్తుంది. మనుగడ స్థాయిని అధిగమించి నేరుగా ఉత్పత్తిదారుల ఉత్పాదకత సాగడానికి యిది యిలా వుంటుంది. "వైరుధ్యాలూ లేవు, పురోగతీ లేదు" అని "ద పావర్టీ ఆఫ్ ఫిలాసఫీ" చెపుతోంది. "నాగరికత అనుసరించిన నియమం యిది... యిప్పటిదాకా ఉత్పత్తిశక్తులు యీ వర్గ వైరుధ్యాలవ్యవస్థ ధర్మమా అనే అభివృద్ధి చెందాయి." అయితే పెట్టుబడిదారీ విధానం ప్రవేశపెట్టిన ఉత్పత్తి పురోగతి, వర్గపాలన అనుకూలాన్నీ, చారిత్రక తార్కికతనీ రద్దు చేస్తుంది. యే వర్గమేనా తన పాలన భద్రపరచుకోవడానికి రాజ్యమే ప్రధాన వాహిక కాబట్టి, అది వర్గానంతర సమాజంలో డుల్లిపోతుంది.

చారిత్రక భౌతికవాదం ప్రతిపాదించే వాదన యేమిటీ అంటే వర్గపోరాటం, మానవచరిత్ర మౌలిక చలనమార్గమూ అనేవి ఉత్పత్తి శక్తుల పురోగతిమీద వుంటాయి. అయితే యీ పురోగతిని సైద్ధాంతిక నమూనా స్థాయిలోనే అవగతం చేసుకోవాలి. యీ నమూనా అందులో యిమిడివున్న ఉత్పత్తి ప్రత్యేక విధానాల స్వభావాన్ని వెల్లడిచేస్తుంది. అలాంటి సిద్ధాంతం యే ఫలానా సమాజానికి సంబంధించి అయినా చాలా నైరూప్యంగా వుంటుంది. ఆ రకంగా మార్క్స్, ఉదాహరణకు పెట్టుబడిదారీ పరిణామాన్ని భావవాచక రూపంలోనే అందిస్తాడు. ఫలానా పెట్టుబడిదారీ జాతి రాజ్య ప్రత్యేక స్వరూప స్వభావాల్ని బట్టి యిలా

అందిస్తాడు. "పెట్టుబడి" సోషలిజం "అనివార్యం" అన్న ప్రకటనను ధ్రువపరుస్తుంది. కాని అదే సూచనతో సోషలిజం ఫలనా సమయంలో, ఫలానా చోట వస్తుందని యెవళ్ళూ జోస్యం చెప్పలేరు - పెట్టుబడిదారీ అభివృద్ధి ధోరణి సోషలిజాన్ని తెచ్చిపెట్టేటట్టు వుందని చెప్పడం అన్నమాట. అలాగే ప్రతి సమాజపు నిర్దిష్టగతీ, వూరికే ఉత్పత్తిశక్తుల, సంబంధాలలో సార్వజనీన గతితర్కాన్ని పునరుల్లేఖించనూ లేదు. సమాజాలు యెప్పుడోగాని గిరిగీసుకుని వేర్పాటుగా వుండవు. వాటి బయటవున్న ఉత్పత్తి పురోగతికీ అస్పృశ్యంగానూ, అప్రభావితంగానూ వుండవు. అదేవిధంగా భూగోళం మీద వున్న ప్రతి సామాజిక బృందం అదే ఆర్థికాభివృద్ధి దశలను దాటి వెళ్ళాలని రాసిపెట్టీలేదు. అలాగే ఆ ఫలానా సామాజిక నిర్మాణం మొత్తం దాని అంతర్గత ఉత్పత్తి సంఘటనలని బట్టీ వుండదు. చారిత్రక భౌతికవాదం దేశాలు వెనకబడి వుండచ్చనీ లేదా కొన్ని అడుగులు గెంతిపోనూ పోతాయనీ చెపుతూ వున్నా, వాటి గతిని లోపలవున్న సర్వగ్రాసి ధోరణి సామాజిక, ఆర్థిక పరిస్థితి బట్టే చెప్పాల్సి వుంటుంది, అభివృద్ధి అనేది ఉత్పత్తిశక్తుల్ని బట్టే వుంటుందనీ చెప్పాలి.

ఈ "ముందుమాట" అసియా తరహా, అదిమ ఫ్యూడల్, ఆధునిక బూర్జువా ఉత్పత్తి విధానాలు మానవళి పురోగతిలో ప్రముఖ యుగాలని నిర్దేశిస్తుంది. అయితే యివి మొత్తం సామాజిక, ఆర్థిక సాధారణ దశలనే సూచిస్తాయి - ప్రతి దేశమూ, మినహాయింపులు లేకుండా, చరిత్రలో నడిచి వెళ్ళాల్సి నటువంటివి కావు, పైకి సాగడానికి 1877 నవంబరులో మార్క్స్ రాసిన ఉత్తరం ఒకటి ప్రసిద్ధం. అందులో మార్క్స్ ఒక అంశాన్ని గుర్తుగా తిరస్కరించాడు. అది, "సాధారణ పురోగతి (marche generale) అనే యే చారిత్రక - తాత్విక సిద్ధాంతాన్నైనా ప్రతి ప్రజమీదా విధి రుద్దింది" అన్న ప్రతిపాదన. యీ ఉల్లేఖన తరచు వినబడేదే అయినా గానీ, యిది చారిత్రక నిశ్చితవాదాన్ని కొట్టి పారేస్తుందని కాదు. మార్క్స్ ఒక అంశాన్ని స్థిరంగా విశ్వసించాడు. అది చరిత్ర అవశ్యకమైన ఉత్పత్తి-శక్తి - నిర్ణీతమైన పరిణామం అన్నది. అలాగని, ప్రతి సాంఘిక బృందం అదే దానిబట్టి పోవాల్సి వుందన్న మాటనీ పట్టుకు కూర్చోలేదు. నిజానికి, ఒక విషయం బహుశా జరగచ్చని అనిపిస్తోంది. అదేమిటీ అంటే మార్క్స్

తన చారిత్రక దశల పట్టికను (కనీసం, ఫ్యూడల్ పూర్వదశలను) పునః పరిశీలించే మొగ్గు కనిపింపచేశాడు అన్నది. యేమంటే ఆయన మానవజాతి తొలి ఉత్పత్తి విధానాలని సవివరంగా విశ్లేషించక పోవడంబట్టి. మార్క్సు చారిత్రక ప్రణాళిక సవరింపు, అలాగే పెట్టుబడిదారీ విధాన విశ్లేషణ (సోషలిజం వేపు సాగుతుందని సూచించే పరివర్తన) చారిత్రక భౌతిక వాదపు మౌలిక ప్రతిపాదనలతో సూత్రరీత్యా సమసిస్తూనే వున్నాయి. ఒక విషయం మాత్రం గుర్తుంచుకోవాలి. అదేమిటీ అంటే చారిత్రక భౌతికవాదం చరిత్రలోని ప్రతి వివరాన్నీ విశదం చేస్తుందన్న భ్రమ వుండకూడదు. దీని స్థూల పరిశీలనలో, చాలా చారిత్రక సంఘటనలు, అవి నిశ్చితంగా తీసుకునే ప్రత్యేక రూపాలు యాదృచ్ఛికం. అలానే యీ సిద్ధాంతం శాస్త్రీయంగా వ్యక్తిగత ప్రవర్తనని వివరించాలనీ చూడదు, యీ సిద్ధాంతం ఆయా ప్రవర్తనల్ని ఆ చారిత్రక పరిమితుల్లో స్థానం కల్పించడానికి ప్రయత్నం చేసినా చరిత్రలో తప్పించుకోరాని ధోరణులు వున్నంతమేరకు, అవి సంభవిస్తాయి. అంటే వ్యక్తుల యిష్టానిష్టాలతో ప్రమేయం లేకుండా ఒక సామాజికశాస్త్రీయ సిద్ధాంతంగా చారిత్రక భౌతికవాద వివరణాత్మక మహత్తర ఆశలు దీన్ని ఒక చారిత్రక నిశ్చిత వాదానికి నిబద్ధం చెయ్యవు.

చారిత్రక భౌతికవాదం మార్క్సిజానికి కేంద్రకమైంది. అంచేత మార్క్సిజంలోని వివిధ రాజకీయ, బౌద్ధిక శాఖలు, యీ సిద్ధాంతాన్ని వ్యాఖ్యానించడంతో విభేదిస్తూ ప్రత్యేకతను సంతరించు కున్నాయి. సముచిత ప్రామాణికతవున్న వ్యాఖ్యను పైన చూశాం. కాని యీ సిద్ధాంతం గురించిన మౌలిక భావనలకు సంబంధించీ, సూత్రీకరణలకు సంబంధించీ వాగ్వివాదాలు చెలరేగుతూనే వున్నాయి, అలాగే యిందులో వున్న వివిధ అంశీభూత విషయాల తారతమ్య ప్రాముఖ్యత గురించీనీ. చారిత్రక భౌతికవాదాన్ని కొన్ని కోరికల సంపుటి స్థాయికి కుదించకుండా యిదొక సంభావ్య అనుభవాద సిద్ధాంతం అని తెలియ చెయ్యడం దుస్సాధ్యం అవుతోంది. యీ సిద్ధాంతం యెంతో విస్తృతం అయింది కావడంవల్లా, వ్యాఖ్యానాత్మక ఏకాభిప్రాయం లుప్తం కావడంవల్లా, దీని సాధ్యతను నిర్దిష్టంగా మదింపు చెయ్యడం మరీ కష్టతరం అవుతోంది.

❀ ❀ ❀